"ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ,
ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక,
సరదాగా యిది చెయ్యాలింక" — ఫెవీ ఫెయిరీ



"ఇంద్రజాలం కానే కాదిది
చేత్తోచేసే తమాషా యిది
దబ్బూతోనూ పనియే లేదు
దీనికి యిక మరి తిరుగేలేదు."
"ఏమిటిదంతా యిటొచ్చి చెప్పు
ఏంచెయ్యాలో దబ్బున చెప్పు."
"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో వినిపొండర్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ పర్సయినా చేసెయ్యొచ్చు
పట్టుకోకనే పట్టుకునేదిది
మురికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మేదైనా చేసెయ్యింక"

ఏస్టర్ పూలు ఎలా తయారుచెయ్యాలి అనే తీరుని ఉచితంగా పొందటం కోసం ఈ కూపన్ పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి : "ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020.

ఏస్టర్ పూలు ఎలా తయారు చేయాలి అనే తీరుని ఉచితంగా పొందటం కోసం ఈ కూపన్‌ను ఈ చిరునామాకు పంపించండి : "ఫెవీ ఫెయిరీ," పోస్ట్ బాక్స్ 11084 బొంబాయి 400 020.

పేరు : ____________________
వయసు : ____________________
చిరునామా : ____________________
____________________
పిన్‌కోడ్ : ____________________
సంతకం : ______________ తేదీ : ______________

[illegible]




ఫెవికాల్ ఎమ్ ఆర్
సింథెటిక్ ఎడ్హెసివ్

బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది. ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది

® అది [logo] మరియు ఫెవికాల్ బ్రాండ్ రెండూ పిడిలైట్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి 400 021 వారి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్‌లు గలవి.

OBM 9403 TL

# సూపర్ ఫైటర్స్!




అయన్ని మెచ్చుకునేవాళ్ళు అంటారాయన్ని 'లిటిల్ 'మాస్టర్' అని. కాని ప్రపంచానికి తెలుసు అతను సూపర్ బేట్స్‌మెన్ అని. మరి సునీల్ గావాస్కర్ అంటారు గదా, "నేను సూపర్ ఫైటర్‌ని. మా అబ్బాయి కూడా అలాగే అవ్వాలని నా కోరిక. అందుకే మరి వాడికి చిన్నప్పటినుంచి నేర్పడం మొదలెట్టానిక. ఫోర్‌హాన్స్ టూత్ పేస్ట్‌తో— పిప్పిపళ్ళను నిరోధించే ఆ సూపర్ ఫైటర్‌తో. బేక్టీరియా అన్నది ఆహారపు కణాలపై పెరుగుతుంది. అది ఆమ్లాలను వదులుతుంది—అవి పిప్పిపళ్ళు అయ్యేలా చేస్తాయి. ఫోర్‌హాన్స్ సూపర్ ఫైటర్‌లో చురుకుగా పనిచేసే ఫ్లోరైడ్ వుంది—అది పంటి ఎనామెల్‌ని గట్టిపరుస్తుంది—దాంతో ఆమ్లం యొక్క చర్యను నిరోధిస్తుంది.

ఇక ఫోర్‌హాన్స్‌లోనే ప్రత్యేకంగా గల ఎస్ట్రింజంట్ అనే పదార్థం ఇగుళ్ళను బిగుతుగా వుండేలా చేస్తుంది. దాంతో పళ్ళకి మరింతగా పునాదిలాంటి గట్టిదనం, మరింత కాలం అలా నిలిచి వుండగలగడమూను.

సునీల్ అంటున్నారిలా—"మా అబ్బాయికి నేను యిస్తాను ఫోర్‌హాన్స్ సంరక్షణ. మరి మీరో?"



ఫోర్‌హాన్స్

32 తీరులో వుండేలా

GM-113/86 Tel




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["సునందుడి భంగపాటు]"కు ఆధారం, లక్ష్మిగాయత్రి రచన. లోకంలో, ఏనాడూ దుష్టపాలకులకు కొదువలేదు. ప్రజలు ఆ దుష్టులపై తిరుగుబాటుచేసి, పదవీచ్యుతుల్ని చేయడం, ఒక్కొక్కసారి సాధ్యపడదు. అయితే, కొన్ని అపురూప సంఘటనల కారణంగా, దుష్టపాలకుల ప్రవర్తనలో మార్పు వచ్చే అవకాశం వున్నది. ఈ విషయం, ''దుష్టపాలన'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

బ్రహ్మఘ్నే చ సురపే చ చౌరే, భగ్నవ్రతే తథా,
నిష్కృతిర్విహితా సద్భిః, కృతఘ్నే నాస్తి నిష్కృతిః.

[బ్రహ్మహత్య చేసినవాడూ, తాగుబోతూ, దొంగా, వ్రతభంగం చేసినవాడూ మొదలైనవాళ్ళకు సైతం, నిష్కృతి ఉన్నది. కాని, చేసిన మేలు మరచినవాళ్లకు మాత్రం, లేదని విజ్ఞులు చెబుతారు.]

సంపుటి 80 ఏప్రిల్ '87 సంచిక 4

విడి ప్రతి : 2–50 : : సంవత్సర చందా : 30–00

CHITRA

"రస్నా పార్టీలు రోజూ ఉంటే
ఎంత బాగుంటుంది!"

రస్నా




జబ్రా నారింజ రుచి! బలే మజా!



భారతదేశపు అత్యధికంగా అమ్ముడవుతున్న
సాఫ్ట్ డ్రింక్ కాన్సంట్రేట్

తయారుచేస్తున్నవారు : పయోమా ఇండస్ట్రీస్, [illegible], అహ్మదాబాద్ 380 016.

# చందమామ కబుర్లు



## మూగతనం పోగొట్టిన కల!

రెండవ ప్రపంచ యుద్ధంలో వినికిడి శక్తి, మాట్లాడే శక్తి పోగొట్టుకున్న ఒక రష్యా సైనికుడు, ఇటీవల ఒక కలగన్నాడు. యుద్ధరంగంలో నాజీసేనలు తన మీదికి విరుచుకుపడేట్టూ, వాటిని ఎదుర్కోవడానికి తను గొంతువిప్పి గట్టిగా యుద్ధ నినాదాలు చేసినట్టూ, కలగని మేల్కొన్నాడు. వెంటనే అతనికి అంతవరకూ ఉన్న చెవుడు మాయమయింది. పోయిన మాట ఆశ్చర్యకరంగా తిరిగి వచ్చింది.

## మార్క్ ట్వైన్ తాజానవల!

హకిల్ బెరీఫిన్, టామ్ స్వాయర్ మొదలైన రచనలు చేసిన సుప్రసిద్ధ రచయిత మార్క్ ట్వెయిన్ 1910 వ సంవత్సరంలో కాలధర్మం చెందిన విషయం అందరికీ తెలుసు. అయితే, ఆయన చరమదశలో రాసిన ఒక నవల ఇంతవరకూ ప్రచురింపబడలేదు. మిసోరీ విశ్వవిద్యాలయానికి చెందిన ఒక అధ్యాపకుడు ఈ నవలను కనుగొన్నాడు. ఇదొక విషాద నవల.





## వ్యాధి నయం చేసే కన్నీళ్లు!

కన్నీళ్ళు కార్చినట్టయితే మనసు కాస్త తేలిక పడటంతోపాటు, అది వ్యాధి త్వరగా నయం కావడానికి కూడా దోహదం చేస్తుందని, సోవియట్ రష్యాకు చెందిన ఒక పరిశోధక బృందం తెలియజేస్తున్నది.

## కోతి—మనిషి!

ఉన్నచోటి నుంచి కదలకుండా, కోతి ఎక్కడ ఉన్నదీ చెప్పగల పెద్ద మనిషి శాన్‌ఫ్రాన్సిస్కోలో ఉన్నాడు. జంతు ప్రదర్శనశాలల నుంచి కోతులు తప్పించుకుని పారిపోయినట్టయితే, అధికారులు వాటి ఆచూకీ తెలుసుకోడానికి ఈ పెద్ద మనిషిని సంప్రతిస్తారు. అవి ఎక్కడ ఉన్నవీ ఈయన సరిగ్గా చెబుతాడు. అయితే,—ఆ కోతులను పట్టుకోవడం ఎలా అన్నదే అసలు సమస్య—అంటున్నారు, జంతుప్రదర్శనశాల అధికారులు.



# జాజలి

జాజలి అనే ముని, తూర్పు సముద్రతీర అరణ్యంలో తపస్సు చేస్తూ ఉండేవాడు. క్రూర మృగాలకూ, ఎండా వానలకూ భయపడకుండా, ఆయన ఎంతో నియమనిష్ఠలతో తపస్సు చేయసాగాడు.

ఒకనాడాయన నిలబడి తపస్సు చేయడం ప్రారంభించాడు. కొంతసేపటికి రెండు పిచ్చుకలు వచ్చి, ఆయన తలపై కూర్చున్నాయి. వాటికి ఇబ్బంది కలిగించకూడదని, జాజలి, తలను అటూ ఇటూ కదిలించకుండా ఉండిపోయాడు. మరి కొంతసేపటికి ఆ పిచ్చుకలు, చుట్టుపక్కల ఉన్న చెత్తాచెదారం పోగుచేసి, జాజలి తల మీద గూడు కట్టడం ప్రారంభించాయి. అయినా, జాజలి మనోనిబ్బరంతో అలాగే ఉండిపోయాడు. రోజులు గడిచాయి. పిచ్చుక గుడ్లు పెట్టి పొదిగింది. గుడ్లు పగిలి, పిచ్చుకపిల్లలు రెక్కలు వచ్చి ఎగిరిపోయాయి. వెళ్ళిన పిచ్చుకలు తిరిగి రాగలవేమో అని, జాజలి, నిలబడిన భంగిమలోనే నెల రోజులపాటు కదలకుండా గడిపాడు. కాని, వెళ్ళిన పక్షులు మరి తిరిగి రాలేదు. అప్పటికి తన భంగిమను మార్చుకుని, జాజలి కొంతసేపటికి సముద్రస్నానానికి బయలుదేరాడు.

సముద్రంలో స్నానం చేస్తూ, తను పిచ్చుకలపట్ల ప్రదర్శించిన సహనాన్నీ, చూపిన కరుణనూ తలచుకుని, జాజలి, ఒక్కక్షణం నవ్వాడు। వెంటనే సముద్రం నుంచి ఒక రాక్షసుడు పైకి వచ్చి, "జాజలీ, నీ నవ్వు కారణం నాకు తెలుసు. ఏదైనా సత్కార్యం. చేసినప్పుడు దానిని గురించి, గర్వించి నట్టయితే, ఫలితం నశిస్తుంది. మంచి పనులు చేసినప్పుడు, వినయం చూపాలి గాని, గర్వపడకూడదు. ఈ విషయం విపులంగా తెలుసుకోవాలంటే, నువు, కాశీనగరానికి వెళ్ళి తులాధరుణ్ణి దర్శించు," అని చెప్పి మాయమయ్యాడు.

రాక్షసుడి ఆదేశానుసారం, జాజలి కాశికి వెళ్ళి తులాధరుణ్ణి దర్శించి, ఆయన ద్వారా ఎన్నో ధర్మసూక్ష్మలను తెలుసుకుని, వినయశీలిగా కీర్తిగాంచాడు।





# పొట్టివాడి సాయం

ఒక పేద రైతు, గ్రామంలో అందరికన్నా ధనవంతుడైన భూస్వామి నుంచి, పదెకరాల భూమి కౌలుకు తీసుకున్నాడు. అయితే, ఆ భూమి ఏమంత సారవంతమైనది కాదు. అయినా, కష్టపడితే, కాని పని ఏమున్నదన్న మొండి ధైర్యంతో, రైతూ, అతడి భార్యా, యిద్దరు పిల్లలూ, అందులో వాననక, ఎండనక శ్రమపడే వాళ్ళు. కాని, అందులో వచ్చే ఫలసాయం వాళ్ళ తిండికీ, బట్టకూ సరిపోయేది కాదు.

ఇలా వుండగా, ఒక సంవత్సరం పొలానికి దాపులనున్న నది పొంగి, పొలంలో వున్న పంటతోపాటు, అతడి ఎద్దులజతలో ఒకటి, వరదకు కొట్టుకుపోయింది. రైతు యిలా నష్టపడినా, భూస్వామికి చెల్లించవలసిన కౌలు డబ్బు చెల్లించక తప్పదు గనక, అతడు తనవద్ద ఉన్న ఎద్దును తోలుకుని సంతలో అమ్మేందుకు బయలుదేరాడు.

దారిలో అతడికి వింత దుస్తుల్లో వున్న ఒక పొట్టివాడు కనిపించాడు. వాడు ఒక కాలు కుంటుతున్నాడు. రైతును చూస్తూనే వాడు, ''కాలికి దెబ్బ తగిలింది. నడవలేక పోతున్నాను. నాదీ, నీవెళ్ళేదారే. నీ ఎద్దు మీద కొంతదూరం సవారీ చేయనిస్తావా ?" అని అడిగాడు.

రైతు, ఆ పొట్టివాడి స్థితికి జాలి పడుతూ, ''నువ్వు నడవలేక బాధపడుతున్నమాట నిజమే. కాని, గాడిదా, గుర్రంలాగా ఎద్దు సవారీజంతువు కాదు. గోజాతి మీద సవారీ చెయ్యడం తప్పు,'' అన్నాడు.

ఆ జవాబుకు పొట్టివాడు దీనంగా ముఖం పెట్టి, ''చీకటిపడితే, యీ అడవి ప్రాంతాన, నేనేమైపోతాను ! ఏ క్రూర మృగమో తినేస్తుంది.'' అన్నాడు.

ఆర్. మీనాక్షి

ఆ మాటలతో రైతుకు, పొట్టివాడి మీద మరింత జాలికలిగి, "సరే, ఆపద్ధర్మమంటూ ఒకటున్నది గదా!" అని పొట్టివాణ్ణి ఎత్తి, ఎద్దు మీద కూర్చోబెట్టాడు.

ప్రయాణం కొంతదూరం సాగాక, పొట్టివాడు రైతు నుంచి అంతా తెలుసుకుని, "నువ్వెంతో దూరం శ్రమపడి సంతకు వెళ్ళడం ఎందుకు? ఈ ఎద్దును నేనే కొంటాను," అన్నాడు.

రైతు అందుకు సరేనన్నాడు. పొట్టివాడు దుస్తుల్లోంచి ఒక చిన్న మరచెంబు బయటికి తీశాడు. అది కంచుది. దాని మీద పొట్టివాడి రూపురేఖల్లోనే వున్న, చాలామంది బొమ్మలు చిత్రింపబడి వున్నవి.

పొట్టివాడు దాన్ని రైతుకు యిచ్చి, "నీ ఎద్దు ఖరీదు చెల్లించాను; యిక ఇంటికి తిరిగిపో!" అన్నాడు.

అది విని రైతు ఎంతో ఆశ్చర్యపడి, "ఈ కంచుమరచెంబు, నా ఎద్దు ఖరీదు చేస్తుందా? బాగానే వున్నది. మరి, నేను భూస్వామికి చెల్లించవలసిన కౌలు డబ్బు ఎక్కణ్ణించి తెచ్చేది?" అని అడిగాడు.

పొట్టివాడు పెద్దగా నవ్వి, "నా మాట నమ్ము. ఆ మరచెంబు, నీ కష్టాలన్నీ తొలగించి, సుఖపడేలా చేస్తుంది," అంటూ చెంబు మూత తీశాడు.

ఆ మరుక్షణం చెంబులోపలి నుంచి, అతి శ్రావ్యమైన పాట వినిపించింది. పొట్టి



వాడు చెంబు మూత ఎప్పటిలా బిగించి, "ఒక్క యక్షులు తప్ప, అంత మనో హరంగా ఎవరూ పాడలేరు, తెలిసిందా?" అన్నాడు.

"అంటే—ఈ సంగీతం వింటూ, నా ఆకలీ, నా పెళ్లాంబిడ్డల ఆకలీ చల్లార్చుకో మంటావా ?" అని అడిగాడు రైతు.

ఆ ప్రశ్న వింటూనే పొట్టివాడు, "అయ్యో, నా మతిమరుపు!" అంటూ తల పట్టుకుని, "నీకు అసలు సంగతి చెప్ప మరిచాను. నువ్వు ఇంటికి వెళ్ళ గానే శుచిగా స్నానం చేసి, ఇంటి మధ్య కొంత భాగం శుభ్రపరిచి—అక్కడ, ఈ మరచెంబును వుంచు. తరవాత, దాని మూత తెరిచి—మరచెంబూ! మరచెంబూ! నువ్వు చెయ్యగల సాయమేదో చెయ్యి! అను, తెలిసిందా ?" అని, ఎద్దును అదిలించి, దాపులనున్న చెట్లచాటుకు వెళ్ళిపోయాడు.

రైతు మరచెంబుతో ఇంటికి తిరిగి వచ్చి, సంగతి చెప్పగానే, అతడి భార్య దిగులుగా ముఖంపెట్టి, "ఏం చేస్తాం, ఖర్మ! నిన్నెవడో నిలువునా మోసగించాడు," అన్నది.

"వాడి ముఖం చూస్తే, మోసకారిలా కనిపించలేదు; చూద్దాం!" అంటూ రైతు, పొట్టివాడు చెప్పినట్టు చేసి, మరచెంబు మూత తెరిచి, "మరచెంబూ! మరచెంబూ! నువ్వు చెయ్యగల సాయమేదో చెయ్యి!" అన్నాడు.





ఆ వెంటనే పొట్టివాడి లాంటి యిద్దరు మరుగుజ్జులు ఠంగ్ మనే పెద్ద శబ్దంతో మరచెంబు నుంచి బయటికి గెంతి, అక్కడ వున్న మంచాల మీదా, ముక్కాలి పీటల మీదా, బంగారు కాసుల్నీ, వెండి పాత్రల్నీ గుమ్మరించారు.

ఇది చూసి రైతూ, అతడి భార్యా పిల్లలూ ఆశ్చర్యపడుతున్నంతలో, వాళ్ళు బంగారు పళ్ళాలలో పంచభక్ష్యపరమాన్నాలతో విందుభోజనం వడ్డించి, అదృశ్యులయ్యారు.

రైతు కుటుంబం ఏనాడూ, అంత రుచికరమైన భోజనం తిని వుండలేదు. రైతు, పొట్టివాళ్ళు యిచ్చిపోయిన బంగారు కాసులతో, మంచి ఇల్లు కొనుక్కొని, అందులో అవసరమైన సౌకర్యాలన్నీ ఏర్పాటు చేసుకున్నాడు.

నెల తిరక్కుండానే భూస్వామికి ఆనోటా, యీనోటా రైతుకు పట్టిన అదృష్టం, మహత్తుగల మరచెంబు సంగతీ తెలియవచ్చింది.

ఆయన ఒకనాడు రైతు ఇంట లేని సమయం చూసి, నౌకర్లతో వచ్చి, అతడి ఇంట్లో గల డబ్బుతోపాటు, మరచెంబును కూడా ఎత్తుకుపోయాడు. భూస్వామి బలవంతుడూ, పలుకుబడిగలవాడూ కనక, రైతు ఏమీ చేయలేక వూరుకున్నాడు.

అతడికి తిరిగి పేదరికపు బాధలు ప్రారంభమయినై. ఒకనాడు అతడి భార్య, భర్తకు కంచు మరచెంబు యిచ్చిన పొట్టివాణ్ణి కలుసుకోమని సలహా యిచ్చింది.

రైతు సరేనని లోగడ పొట్టివాడు కనిపించిన ప్రాంతానికి వెళ్ళాడు. అక్కడ ఒక చెట్టుకొమ్మమీద కూర్చుని వున్న పొట్టివాడు, ముందుగా రైతును చూసి, కొమ్మమీదినుంచి దభీమంటూ దూకి, అతడి దగ్గిరకు వచ్చి, "ఏం, యిలా వున్నావు? నేనిచ్చిన మరచెంబు, నీకెలాంటి సాయం చెయ్యలేదా?" అన్నాడు.

రైతు జరిగినదంతా పొట్టివాడికి చెప్పాడు. అంతా విన్న పొట్టివాడు చెట్టు

పైకిపోయి, అక్కడ వున్న తొర్రలోనుంచి, ఒక వెండి మరచెంబు తెచ్చి, రైతు కిచ్చాడు. రైతు సంతోషంగా దాన్ని తీసు కుని ఇంటికి తిరిగివచ్చాడు.

అయితే, భూస్వామికి తను రైతును ఒక కంట కనిపెట్టమని నియమించిన నౌకర్లద్వారా సంగతి తెలిసింది. వాళ్ళు, కంచు మరచెంబుకన్న, యీ వెండిది మరింత ప్రభావంగలదని తాము విన్నట్టు, ఆయనకు చెప్పారు.

భూస్వామి ఏదోవిధంగా దాన్ని దొంగి లించాలనుకుని, ఆ సాయంత్రం విందు ఏర్పాటు చేసి, రైతును ప్రధాన అతిథిగా ఆహ్వానించాడు.

రైతు రాగానే, భూస్వామి మిగతా అతిథులతో, "మన ప్రధాన అతిథి దగ్గర, గొప్ప ప్రభావంగల మరచెంబొకటి వున్నది. దాన్ని ఆయన మనముందు ప్రదర్శిస్తాడు," అని చెప్పాడు.

వెంటనే రైతు దుస్తుల్లోనుంచి మర చెంబు బయటికితీసి, కిందపెట్టి, "మర చెంబూ! మరచెంబూ! నువ్వు చెయ్యగల సాయమేదో చెయ్యి!" అన్నాడు.

ఆ మరుక్షణం నల్లని రూపాలతో, ఇద్దరు మహాకాయులు మరచెంబునుంచి హుంకరిస్తూ బయటికి దూకి, చేతిలో వున్న దుడ్డు కర్రలతో, భూస్వామిని కొట్ట సాగారు.

భూస్వామి కేకలుపెడుతూ, రైతుతో, "నీ పుణ్యంవుంటుంది! ఈ ఇద్దర్నీ తిరిగి మరచెంబులోకి వెళ్ళమను," అన్నాడు.

రైతు ఏమాత్రం తొణక్కుండా, "ముందు, ఆ కంచు మరచెంబు నాకివ్వు!" అన్నాడు.

భూస్వామి ఇంట్లోకి పరిగెత్తిపోయి, దాన్ని తెచ్చి రైతుకిచ్చాడు. మహాకాయు లిద్దరూ వెండి మరచెంబులోకి వెళ్ళారు.

కొద్ది రోజుల్లోనే రైతు, ఆ చుట్టుపక్కల గల ధనవంతులందరికన్న, ధనవంతు డయ్యాడు. తన అవసరం తీరాక, అతడు మరచెంబులు రెంటినీ, ఎవరికీ తెలియని ఒక రహస్య ప్రదేశంలో పాతిపెట్టాడు.






మునిపల్లె అనే గ్రామంలో వుండే రామభద్రయ్యకు, శాంత ఒక్కతే కుమార్తె. ఆమె తెలివిగలది; చాలా అందంగా వుంటుంది. తన ప్రమేయం ఏమీ లేకుండా, ఆమె తనకు నచ్చినవాణ్ణి పెళ్ళి చేసుకునేందుకు, తండ్రి తన అంగీకారం తెలిపాడు.

శాంతను పెళ్ళి చేసుకోవాలని, సాగరుడు, నారాయణ అనే యిద్దరు యువకులకు కోర్కె కలిగింది. సాగరుడికి చాలా డబ్బున్నది. నారాయణ తెలివైన వాడు. ఇద్దరూ, శాంతకు తమ కోరిక చెప్పుకున్నారు.

శాంత, వాళ్ళతో, "ఇద్దరూ నాకొక మంచి కానుక తెచ్చివ్వండి. నాకు నచ్చిన కానుకను నా దగ్గరే వుంచుకుంటాను. నచ్చని దాన్ని తిరిగి యిచ్చేస్తాను. ఎవరి కానుక నా దగ్గర వుంచుకుంటే, వారిని నేను పెళ్ళాడేందుకు యిష్టపడినట్టు," అన్నది.

సాగరుడు వెంటనే అప్పటికప్పుడు, ఎంతో విలువైన వజ్రాల హారం తయారు చేయించి, శాంతకు కానుకగా యిచ్చాడు. నారాయణ నాలుగు రోజులపాటు ఎంతో శ్రమపడి, స్వయంగా ఒక గ్రంథం రాశాడు. అందులో అతడు—డబ్బు మనిషిని సుఖాల నుంచి దూరం చేస్తుందనీ, డబ్బును నమ్ముకున్న ప్రతివాడూ కష్టాల పాలవుతాడనీ చక్కగా వివరించాడు. ప్రేమను డబ్బుతో ముడిపెట్టకూడదని చెబుతూ, అందుకు సంబంధించిన పురాణగాథ లెన్నింటినో విపులంగా ఉదహరించాడు.

ఆ గ్రంథాన్ని అతడు, శాంతకు యిచ్చి, "ఈ పేదవాడు, నీకు ప్రేమతో యిచ్చే చిరుకానుక యిదే!" అని చెప్పాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి

శాంత రెండు కానుకలనూ అందుకుని, తనవద్ద ఒక నెల రోజులపాటు వుంచుకున్నది. ఈలోగా సాగరుడి తండ్రికి, కొడుకు చేసిన ఘనకార్యం తెలిసి, తనే స్వయంగా శాంతను చూడవచ్చి, "మా వాణ్ణి అమాయకుణ్ణి చేసి, వజ్రాలహారం కాజేశావు. నీవు అంగీకరించినా, ఈ పెళ్లికి నేనంగీకరించను. హారం నాకు తిరిగి యిచ్చెయ్యి!" అన్నాడు.

శాంత అతడికి బదులు చెప్పేలోగా, సాగరుడు అక్కడికి వచ్చి, తండ్రితో, "నువ్వు యిక్కడికి వచ్చినట్టు, నాకు తెలిసింది. శాంత దగ్గిర హారం తీసుకుంటే, ఇక నేను నీకు దక్కను;" అన్నాడు కోపంగా.

సాగరుడి తండ్రి కొంతసేపు కొడుక్కు నచ్చజెప్పడానికి ప్రయత్నించి విఫలుడై, "సరే, నీ కర్మ! నీ యిష్టాన్ని కాదననులే," అని వెళ్ళిపోయాడు.

"ఇదీ, ఒకందుకు మంచిదే అయింది! మన పెళ్ళికి, మా నాన్న కూడా ఒప్పుకున్నాడు," అన్నాడు సాగరుడు శాంతకేసి సంతోషంగా చూస్తూ.

"నా నిర్ణయం యీ సాయంత్రం చెబుతాను. నారాయణను తీసుకురా," అన్నది శాంత గంభీరంగా.

సాయంత్రం నారాయణ, సాగరుడు శాంత దగ్గిరకు వచ్చారు.

శాంత వజ్రాలహారం, సాగరుడికి తిరిగి యిచ్చి, "నీ ప్రేమను నువ్వు ఋజువు



చేసుకున్నావు. నిన్ను పెళ్ళి చేసుకుంటే, నా ప్రేమకు ఏమాత్రం విలువ వుండదు. అందరూ, డబ్బుకోసమే నిన్ను పెళ్ళి చేసుకున్నాననుకుంటారు. ఈ విషయం, నారాయణ రాసిన పుస్తకం చదివాక నేను చక్కగా అర్థం చేసుకున్నాను. ఇప్పుడు నేను డబ్బును అసహ్యించుకుంటున్నాను,'' అన్నది.

ఆ తర్వాత ఆమె, నారాయణ యిచ్చిన గ్రంథాన్ని అతడికి తిరిగి యిచ్చి, ''నా మనసును, నీ స్నేహితుడికి వ్యతిరేకంగా తయారు చేయాలని, ఈ గ్రంథం రాశావని, నాకు అనుమానం గలుగుతున్నది,'' అన్నది.

నారాయణ వెంటనే, ''శాంతా, నువ్వు నన్ను తప్పుగా అర్థం చేసుకున్నావు. తిరిగి యివ్వలేని వస్తువు, నీకిస్తే నన్ను తప్పక పెళ్ళి చేసుకుంటావుగదా! అందుకోసం, ఈ గ్రంథం రాసి నీకు యిచ్చాను. అంతే గాని, స్నేహితుడిపై గల అసూయవల్ల గాదు. దానిలోని విషయాలన్నీ, ఇప్పుడు నీకు బాగా వంటబట్టాయి. నువ్వు గ్రంథం నాకు తిరిగి యిచ్చినా, అందులోని విషయాలన్నీ, నీ దగ్గిరే వుండిపోయాయి. అంటే—నువ్వు, నేనంటే యిష్టపడినట్టే గదా!'' అన్నాడు.

శాంత అతడి తెలివితేటలకు తెల్లబోయింది.

సాగరుడు వెంటనే నారాయణతో, ''ఎవరి కానుకనైతే తన దగ్గిర వుంచుకుంటుందో, వారంటేనే తను పెళ్ళికి యిష్టపడినట్లని, శాంత చెప్పింది గదా! అందుకని, డబ్బుతో ఆమెను ప్రలోభపెట్ట దలచి వజ్రాలహారం యిచ్చాను. కాని, అభిమానధనులు డబ్బును తిప్పికొట్టగలరని, గ్రహించలేకపోయాను. శాంతను, నువ్వే సరిగా అర్థం చేసుకుని, తిరిగివ్వలేని వస్తువును, ఆమె కిచ్చావు. అందువల్ల నువ్వే, ఆమెకు తగిన వరుడివి,'' అన్నాడు.

శాంతకూ, నారాయణకూ వైభవంగా పెళ్ళి జరిగింది.






## 12

[నాగవర్మ కపిలపురం కోటలో తన సైన్యాన్నంతా పోగొట్టుకుని, మారువేషంతో, జ్వాలా ద్వీపపు పులిరాయుళ్ళ నాయకుడైన కరవీరుడితో కలిసి తప్పించుకుని అడవిలోకి పారిపోయాడు. తరవాత రాకుమారి కాంతిమతికీ, చిత్రసేనుడికీ వివాహం అయింది. వివాహం నాడు ఉగ్రాక్షుడి కొత్త కోరికను నెరవేర్చేందుకు చిత్రసేనుడు అంగీకరించాడు. తరవాత—]

ఉగ్రాక్షుడు తన రాక్షస బంట్లకోసం కేక వేయగానే, కోటలో ఎక్కడెక్కడ వున్న రాక్షసులూ ఒక్కుమ్మడిగా అతడి దగ్గరకు పరిగెత్తుకు వచ్చారు. ఉగ్రాక్షుడు వారందరినీ చిత్రసేనుడికి చూపుతూ, "మహారాజా, మీరు ఏ క్షణాన ఎలాంటి సహాయం కావాలన్నా, నేనూ వీళ్ళూ రాగలం. మీరు నా కోటకు కాకితో కబురంపితే చాలు," అన్నాడు.

చిత్రసేనుడు చిరునవ్వు నవ్వాడు. "నీ నుంచి గానీ, నీ బంట్ల నుంచి గానీ ఏమాత్రం సహాయం కోరే అవసరం లేకుండా, నా రాజ్యపాలన ప్రశాంతంగా జరిగిపోవాలన్నదే నా కోర్కె. అడవిలో ఎక్కడో మాయమైన ద్రోహి నాగవర్మనూ, అతని అనుచరుడు కరవీరుణ్ణీ, నీ బంట్లు పట్టుకు రాగలిగితే బావుండును. నాకూ, నీకూ కూడా ఏనాటికైనా ప్రమాదం




అంటూ కలిగితే—వాళ్ళిద్దరి నుంచే,'' అన్నాడు చిత్రసేనుడు.

''మహారాజా, వాళ్ళు ప్రస్తుతానికి అయిపూ అజా లేకుండా మాయమయారు. కాని, వాళ్ళు ఎంతోకాలం ఈ అడవుల్లో, కొండల్లో దాగివుండలేరని నా నమ్మకం. ఈనాటి నుంచి నా సేవకుల్లో సగంమందికి వాళ్ళను వెతికి పట్టుకునే పని ఒప్పచెపుతున్నాను,'' అన్నాడు ఉగ్రాక్షుడు ఆవేశంగా.

చిత్రసేనుడి పక్షాన చేరిన పులిరాయుడు అమరపాలుడికి ఆ ద్రోహులిద్దరూ ప్రాణాలతో దొరుకుతారన్న నమ్మకం పోయింది. అతడు నిరాశగా తల వూపుతూ, ''మహారాజా, వాళ్ళు ఈసరికే తూర్పు సముద్రంలో వున్న జ్వాలాద్వీపానికి ప్రయాణం కడుతూండి వుంటారని నా అనుమానం,'' అన్నాడు. చిత్రసేనుణ్ణి కూడా అలాంటి అనుమానమే బాధిస్తున్నది. ఉగ్రాక్షుడు అడవిలోని తనకోటకు ప్రయాణమయాడు.

రెండు మూడు నెలలు గడిచినై. ఉన్నట్టుండి హఠాత్తుగా రాజ్యంలో అక్కడా యిక్కడా దారిదోపిళ్ళూ, గృహదహనాలూ ప్రారంభమయినట్టు చిత్రసేనుడికి వేగుల ద్వారా వార్తలు అందినై. ఈ దోపిళ్ళు చేసేవాళ్ళు సుశిక్షితులూ, అన్నింటికీ తెగించిన పరమదుష్టులని కూడా తెలిసింది. వాళ్ళు అడవి దారుల పక్కనా, కొండ కోనల్లోనూ దాగివుండి, హఠాత్తుగా బాటసారుల మీదా, గ్రామాల మీదా పడి నానా బీభత్సం కలిగించి, దొరికినదల్లా దోచుకుని పారిపోతున్నారు. తమను ఎదిరించినవాళ్ళనూ, వాళ్ళ గ్రామాలనూ నిలువునా కాల్చేస్తున్నారు. ఇంతవరకూ ఈ దుర్మార్గుల్లో ఒక్కగానొక్కడైనా ప్రాణాలతో పట్టుబడలేదు. ఏ ఒకడైనా గాయపడిగాని, లేక గుంపునుంచి వేరైగాని దొరికినా, వాడు వెంటనే ఏదో విషం మింగి ప్రాణాలు విడుస్తున్నాడు. ఆ కారణంగా, ఆ దోపిడిగాళ్ళను ప్రశ్నించి వాళ్ళ నాయకుడెవడో, వాళ్ళ నివాస స్థానా

లెక్కడెక్కడ వున్నవో తెలుసుకునేందుకు సాధ్యం కాలేదు.

చిత్రసేనుడు ఒక పని చేశాడు: ఆయన తన మనుషులను రాజ్యంలోని గ్రామాలకూ, అడవుల మధ్య వుండే గూడేలకూ పంపి; ఇప్పటివరకూ బందిపోట్లుగానూ దారిదోపిడిగాళ్ళుగానూ వున్న వ్యక్తులందరూ క్షమించబడతారనీ, వాళ్ళు తమ తమ ఆయుధాలతో కపిలపురానికి వస్తే, ప్రతి ఒక్కరికీ వ్యవసాయ యోగ్యమైన భూములు యివ్వబడతవనీ చాటింపు వేయించాడు.

చిత్రసేనుడి ఈ ఎత్తుగడ పారింది. వారం తిరక్కుండానే, దాదాపు యాభై మంది బందిపోట్లు కత్తులూ, కటార్లతో కపిలపురానికి వచ్చారు. వాళ్ళందరూ రాజభవనం ముందున్న ఆవరణలో పోగవగానే, చిత్రసేనుడు తను కొత్తగా నియమించిన సేనానాయకుడు అమరపాలుణ్ణి వెంటబెట్టుకుని వాళ్ళ దగ్గిరకు వచ్చాడు. బందిపోట్లను చూస్తూనే అమరపాలుడు వాళ్ళల్లో కొందరిని గుర్తించి, చిత్రసేనుడితో, "మహారాజా, వీళ్ళలో కొందరైనా ద్రోహి నాగవర్మ సైనికులున్నారు. వీళ్ళను నమ్మి మడిమాన్యాలు యివ్వటం మనకు ప్రమాదం అవుతుందేమో," అన్నాడు.



"మీ నాయకుడు నాగవర్మ ఎక్కడ? అతడే మిమ్మల్ని పంపాడా?" అని అడిగాడు చిత్రసేనుడు బందిపోట్లను.

"మాకు ఒక నాయకుడంటూ లేడు, మహారాజా. మీరు అనుమానపడ్డట్టు మేము ఒకప్పుడు నాగవర్మ కింద పని చేసినవాళ్ళమే కాని, ఈ కోటలో మీరు మాటువేసి మా మీదకు రాక్షసుల్ని వదిలినప్పుడు మేము తలా ఒక దారీ అయాం. ఆ నాటి నుంచి యీ నాటివరకూ ఆ నాగవర్మ ఏమయాడో, మాకు తెలీదు," అన్నాడు బందిపోట్లకు నాయకుడైన ఒకడు.

"మీ మాటలు నమ్మటం ఎలా?" అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.



''మమ్మల్ని మీరు క్షమించి, దయగా చూశారని తెలియగానే ఆ మిగిలినవాళ్ళూ మీ శరణు జొచ్చేందుకు వస్తారు, మహారాజా!'' అన్నాడు బందిపోట్ల నాయకుడు.

అమరపాలుడు, చిత్రసేనుడి చెవిలో రహస్యంగా, ''మహారాజా, వీళ్ళ మాటలు నమ్మేందుకు లేదు. ద్రోహి నాగవర్మ వెనక వుండి వీళ్ళచేత యీ నాటకమంతా ఆడిస్తున్నాడో లేదో మనం తెలుసుకునే వరకూ వీళ్ళను కారాగారంలో బంధించి వుంచటం బావుంటుం దనుకుంటాను,'' అన్నాడు.

''అది సాధ్యం కాదు. నేను మాట తప్పినట్టవుతుంది. ఆ తరవాత ప్రజల్లో నా వాగ్దానాలకు విలువేం వుంటుంది?'' అన్నాడు చిత్రసేనుడు.

''అయితే మీరో క్షణం ఆగండి. వీళ్లకో చిన్న బెదురు పెట్టి చూస్తాను,'' అంటూ అమరపాలుడు బందిపోట్లకేసి తిరిగి, ''మీలో కొందరికైనా నాగవర్మా, జ్వాలా ద్వీపపు పులిరాయుళ్ళ నాయకుడు కరవీరుడూ ఎక్కడ వున్నదీ తెలుసునని మహారాజుగారి అభిప్రాయం. మీరు నిజం బయటపెట్టకపోయారో, చిత్రవధ చేయించుతారు,'' అన్నాడు కఠినంగా.

అమరపాలుడు యిలా అనగానే బందిపోట్ల నాయకుడు గుప్పెట ముందుకు

''మీ చాటింపు విని, మీకు లొంగిపోయి, రాజభక్తి గల పౌరులుగా జీవించేందుకు అవకాశం కలుగుతుందని యిక్కడికి వచ్చాం. కేవలం పొట్టకోసమే మేము దోపిడీలకూ, దొంగతనాలకూ పాల్పడ్డాం. మా నేరాలు క్షమించి మమ్మల్ని మీ పౌరులుగా స్వీకరించాలని కోరుతున్నాం,'' అన్నాడు బందిపోట్ల నాయకుడు.

''సరే, మీ మాటలు నమ్మి మీకు సేద్యానికి పొలాలు యిస్తాను, కాని మీరు యాభైమందికన్న ఎక్కువ వున్నట్టులేదు. తతిమ్మా దొంగల మాటేమిటి?'' అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.

చాచాడు. అతడితోపాటు అతడి అనుచరులు కూడా గుప్పెట్లు చాచారు. బందిపోట్ల నాయకుడు దృఢమైన కంఠస్వరంతో, "మహారాజా! మేము మేలుకూ, కీడుకూ కూడా సిద్ధపడే యిక్కడికి వచ్చాం. ఇదిగో, మా గుప్పెటలకేసి చూడండి. ఇందులో చిటికెల మీద ప్రాణం తీసే కాలకూట విషం వున్నది. మీ సైనికులు మా దరికి వచ్చే లోపలే, మేం యీ విషం మింగి మరణించగలం. మరోసారి ప్రమాణం చేసి చెపుతున్నాను. ఆ నాగవర్మ గురించిగానీ, కరవీరుణ్ణి గురించిగానీ మాకేమీ తెలియదు," అన్నాడు.




బందిపోట్ల నాయకుడు అలా అనగానే చిత్రసేనుడికీ, అమరపాలుడికీ కూడా అతడి మాటల్లో నమ్మకం కలిగింది. చిత్రసేనుడు బందిపోట్ల కేసి చిరునవ్వు నవ్వుతూ, "సరే, ఈనాటి నుంచి మీరు రాజ్యంలోని తక్కినవారితోపాటు అన్ని హక్కులూ గల పౌరులు. మీకు ఈ రాజధాని నగరం దాపులనే వ్యవసాయ యోగ్యమైన భూములు ఇప్పిస్తాను," అన్నాడు. చిత్రసేనుడు ఇలా అనగానే బందిపోట్ల నుంచి ఒక్కసారిగా జయజయ ధ్వానాలు వినిపించినై. "చిత్రసేన మహారాజుకూ, జై!" అంటూ వాళ్ళు దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలు చేశారు.

తమ తోటి బందిపోట్లను చిత్రసేన మహారాజు శిక్షించలేదనీ, వాళ్ళకు భూములు యివ్వటం జరిగిందనీ తెలియగానే, రాజ్యంలోని బందిపోటు ముఠాలన్నీ కపిలపురం వచ్చి రాజుగారికి లొంగిపోయాయి.

చిత్రసేనుడికి యిక తన పరిపాలన ఏ ఒడుదుడుకు లేకుండా సాగిపోతుందన్న నమ్మకం కలిగింది. కాని, అతడి కప్పుడప్పుడు ద్రోహి నాగవర్మ ఏమయాడు? ఇంకా బతికే వున్నాడా? వుంటే ఎక్కడ వున్నట్టు? అన్న అనుమానాలు కలుగుతూండేవి. అమరపాలుడు మాత్రం, నాగవర్మ కరవీరుడితో కలిసి జ్వాలాద్వీపం




వెళ్ళి వుంటాడని చెపుతూండేవాడు. అలా జరిగివుంటే, ఏదో ఒకనాడు వాళ్ళు తిరిగీ భయంకర పక్షులతో రాజ్యం మీద ప్రత్యక్షమవుతారు.

ఇలాంటి చిన్నచిన్న భయాందోళనలతో వున్న చిత్రసేనుడు, తన భార్య గర్భవతి అయినదని తెలిసినప్పుడు మరింతగా ఆందోళన పడ్డాడు. ఆ పుట్టబోయే శిశువు మగపిల్లవాడైనా, ఆడపిల్ల అయినా, అయిదేళ్ళు పెంచి రాక్షసుడైన ఉగ్రాక్షుడి పరం చెయ్యాలి.

నెలలు గడిచాయి. రాణి కాంతిమతి ఒకనాటి సూర్యోదయం వేళ ఒక మగ పిల్లవాణ్ణి కన్నది. రాజ్యంలో ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. ప్రజలు ఉత్సవాలు చేసుకున్నారు. ఆ ఉత్సవాల నడుమ ఉగ్రాక్షుడు రాజప్రాసాదానికి వచ్చి, పొత్తిళ్ళలో వున్న రాజకుమారుణ్ణి అంత ఎడంలో నిలబడి చూసి, చిన్న పిల్లవాడిలా కేరింతలు కొడుతూ గంతులు వేశాడు.

"మహారాజా, ఈనాటి నుంచి అయిదేళ్ళు ముగియగానే, ఈ పిల్లవాడు నావాడవుతాడు," అన్నాడు ఉగ్రాక్షుడు.

ఏళ్లు గడుస్తున్నై. కపిలపుర రాజ్యంలో రాత్రివేళల అక్కడక్కడా ఆకాశంలో ఎగిరే మంటలు కనిపిస్తున్నవనీ, అవి అగ్నిపక్షులేననీ ప్రజలు చెప్పుకోసాగారు. క్రమంగా యీ వార్తలు చిత్రసేనుడికి అందినై. రాజ్యంలో నలుమూలల వున్న వేగులవాళ్ళు, ఆ ఎగిరేవి అగ్నిపక్షులేనని ధృవపరిచారు.

ఇదో కొత్త బెడద, అనుకున్నాడు చిత్రసేనుడు. ఇంతలో రాకుమారుడికి అయిదేళ్ళు నిండినై. ఒకనాటి ఉదయం ఉగ్రాక్షుడు తుఫానులా రాజప్రాసాదం ముందుకు వచ్చి పడ్డాడు.

"మహారాజా, వచ్చాను! ఏడీ రాకుమారుడు?" అని అడిగాడు రాక్షసుడు.

"ఇప్పుడే వస్తున్నాడు, కొత్త దుస్తులూ అవీ....అలంకరిస్తున్నారు, ఆగు!" అన్నాడు చిత్రసేనుడు.

చిత్రసేనుడి ముఖంలో ఏమాత్రం విచారఛాయలు లేకపోవటం చూసి, ఉగ్రాక్షుడు ఆశ్చర్యపడ్డాడు. తన ప్రథమ సంతానాన్ని యింత నిర్వికారంగా అతడు తన పరం చేస్తున్నాడేం? కుర్రవాడు కుంటిగాని, గుడ్డిగాని కాదుగదా?

ఉగ్రాక్షుడు యిలా ఆలోచిస్తున్నంతలో దాసీలు పుష్టిగా, ఆరోగ్యంగా వున్న ఒక కుర్రవాణ్ణి తెచ్చి, ఉగ్రాక్షుడి ముందు నిలబెట్టారు. ఉగ్రాక్షుడు ఆ కుర్రవాణ్ణి చూసి ఉత్సాహంగా చప్పట్లు చరిచి, రెండు చేతులతో పట్టి భుజం మీదికి ఎత్తుకుంటూ, "మహారాజా, మీరు అన్న మాట మీద నిలబడ్డారు. మీ మేలు మరవను," అంటూ కోట ద్వారం దాటి అడవిలో ప్రవేశించాడు.

ఉగ్రాక్షుడు అడవి చేరగానే, అతడి భుజం మీద వున్న కుర్రవాడు, దూరంగా చేయి చూపుతూ, "అయ్యా, అయ్యా, ఆ చెట్టుకింద వున్న ఎండు కర్రపుల్ల నాక్కావాలి!" అని మారాం చేశాడు.

ఉగ్రాక్షుడు భుజం మీది నుంచి కుర్రవాణ్ణి దించి, కర్రపుల్ల తెచ్చి అతడి కిస్తూ, "ఈ కర్రతో ఏం చేస్తావు, బాబూ?" అని ముద్దుగా అడిగాడు.

"వంటింట్లోకి కుక్కలూ, కోళ్ళూ రాకుండా తరుముతాను," అన్నాడు కుర్రవాడు.

ఉగ్రాక్షుడు ఉలిక్కిపడ్డాడు. రాజ కుమారుడు వంటింట్లోకి కుక్కలూ, కోళ్ళూ రాకుండా తరమటం ఏమిటి?

"మీ అయ్య ఏం చేస్తూంటాడురా, బాబూ?" అని అడిగాడతడు.

"వంటింట్లో మాంసం, అన్నం వండుతుంటాడు. ఏదైనా కుక్క, మాంసం ఎత్తుకుపోయేందుకు వచ్చిందో, ఈ కర్రతో నడుం యిరగేస్తాను," అన్నాడు కుర్రవాడు.

"ఇంత మోసమా, హుఁ! వంటవాడి కొడుకును, రాజకుమారుడని నాకిస్తారా?" అంటూ ఉగ్రాక్షుడు కుర్రవాణ్ణి భుజాన వేసుకుని హుంకరిస్తూ, కపిలపురం కోటకు బయలుదేరాడు. —(ఇంకావుంది)






# సునందుడి భంగపాటు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, కార్యసాధనకై, నువ్వు పడుతున్న శ్రమ అపూర్వమైనది. అయితే, ఒక్కొక్కసారి వివేచనాజ్ఞానం లోపించడంవల్ల, అనేక కష్టనష్టాల కోర్చి పడిన శ్రమా, వేసిన పథకాలూ వృధా అవడమేగాక, నలుగురి లోనూ భంగపడవలసివస్తుంది. ఇందుకు ఉదాహరణగా, సునందుడనే వాడి కథ చెబుతాను. శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

జ్వాలాముఖీ దేశాన్ని, జలంధరుడనే రాజు పాలిస్తూండేవాడు. అతడు ధర్మ నిరతికీ, ఋజువర్తనకూ పెట్టింది పేరు. అతడికి పుత్ర సంతానం లేదు; ఒకే ఒక

## బేతాళ కథలు



కుమార్తె. అపురూప సౌందర్యవతి అయిన ఆమె పేరు సుచరిత.

కొడుకులు లేని కారణంగా, జలంధరుడు, సుచరితను కొడుకు లాగే పెంచాడు. ఆమె యుద్ధ విద్యలతోబాటు, శాస్త్రాలూ, రాజతంత్రం గురువులవద్ద అభ్యసించి, గొప్ప మేధావిగా పేరు గడించింది. ఆమె పరిపాలనా వ్యవహారాల్లో తండ్రికి సాయపడుతూ, జలంధరుడికి కొడుకులు లేని లోటు తీర్చింది.

ఒకసారి జలంధరుడు, ఒక విచిత్ర వ్యాధికి గురి అయ్యాడు. ఆయనకు అన్న పానాదులు హితవుకాక, రోజుకొక విధమైన బాధతో శుష్కించిపోసాగాడు. ఆస్థాన వైద్యుల వైద్యమంతా, బూడిదలో పోసిన పన్నీరైంది.

జలంధరుడి పరిస్థితి చూసి కలత చెందిన సుచరితా, మహామంత్రీ సంప్రతింపులు జరిపి, రాజు అనుమతితో—ఆయన వ్యాధిని నయం చేసినవారికి అర్ధ రాజ్యమిస్తామని ప్రకటించారు.

ఇందువల్ల కూడా ప్రయోజనం కలగలేదు. దేశంలోని ప్రముఖ వైద్యులూ, సాధువులూ, యోగులూ యిచ్చే కషాయాలూ, భస్మాలూ, మూలికలూ ఏవీ రాజు వ్యాధిని కుదర్చలేక పోయాయి. ఆయన పరిస్థితి విషమించ సాగింది.

జ్వాలాముఖీ రాజధానికి దాపులనున్న, ఒక గ్రామంలో, సునందుడనే పేద యువకుడొకడున్నాడు. వాడు నా అన్నవారెవరూ లేని అనాధ. ఏ పూటకాపూట గుప్పెడు మెతుకులకోసం కటకటలాడే, వాడి దారిద్ర్యాన్ని చూసి, ఎవరూ వాడికి పిల్లనివ్వడానికి ముందుకు రాలేదు.

సునందుడు చివరకు, తన పేదరికం చూసి భరించలేని జుగుప్స చెందాడు. వాడు ఆత్మహత్య చేసుకోదలచి, ఊరికి రెండామడలదూరంలో వున్న ఒక కొండ దగ్గిరకుపోయాడు.

వాడు కొండ ఎక్కి, దిగువనున్న లోయలోకి దూకబోయేంతలో, వెనుక



నుంచి, "ఆగు!" అన్న భీకరస్వరం వినిపించింది.

సునందుడు అదిరిపడి, వెనుదిరిగి చూశాడు. రాక్షసుడొకడు, అతడికేసి వస్తూ, "చావబోతున్నావా? ఎందుకు?" అని ప్రశ్నించాడు.

చావు తెగింపులో వున్న సునందుడు, రాక్షసుణ్ణి చూసి, ఏమాత్రం భయపడక, తన దుస్థితి వివరించాడు.

అంతా విన్న రాక్షసుడు నవ్వి, "నేనీ కొండను ఆశ్రయించుకుని, చాలా కాలంగా నివసిస్తున్నాను. ఈనాటివరకూ, ఆత్మ హత్య చేసుకునేందుకు, యిక్కడికి ఎవరూ రాగా చూడలేదు. సరే, యిప్పుడు నిన్ను చావనివ్వను!" అన్నాడు.

"నా దీన స్థితి విని కూడా, యిలా అనడం బాగాలేదు. నేను తిరిగి గ్రామానికి వెళ్ళను." అన్నాడు సునందుడు మొండిగా.

రాక్షసుడు కొంచెంసేపు ఆలోచించి, "సరే, నీకు సాయం చేస్తే, నాకు కొంత పుణ్యమైనా దక్కుతుంది. జాగ్రత్తగా, విను. ఈ దేశపు రాజు జలంధరుడు, ఒక విచిత్రమైన వ్యాధితో బాధపడుతున్నాడు. వ్యాధిని నయం చేసినవారికి, అర్ధరాజ్యం యిస్తాడట. నేనే వెళ్లబోయి, రాక్షసుణ్ణన్న సంగతి గుర్తుకు వచ్చి ఆగాను. ఇప్పుడు నీకు, ఆ వ్యాధిని నయం చేయగల ఔషధం చెబుతాను. సౌగంధికా మూలికను నూరి, లేత కుంకుడు రసంలో చేర్చి సేవిస్తే, రాజు వ్యాధి నయమవుతుంది. ఆ మూలిక యిక్కడే దొరుకుతుంది. నీకా మూలిక యిస్తాను. రాజు వ్యాధి నయం చేసి, అర్ధ రాజ్యానికి రాజువై, సుఖించు!" అన్నాడు.

సునందుడు పరమానందంతో, సౌగంధికా మూలికను తీసుకుని, రాజధానికి వెళ్ళాడు. కొంత ప్రయత్నంమీద, అతడికి రాజదర్శనం లభించింది. సునందుడు, తాను తెచ్చిన మూలికను నూరి; లేత కుంకుడు రసంలో చేర్చి, రాజుకు



యిచ్చాడు. విచిత్రంగా, మరుసటి రోజు నుంచే జలంధరుడి వ్యాధి తిరుగుముఖం పట్టింది. నాల్గవ రోజుకల్లా, ఆయనకు పూర్తి స్వస్థత చేకూరింది.

ఇది చూసి, రాజకుటుంబం పొందిన ఆనందం, అంతా యింతా కాదు. సునందుణ్ణి అందరూ ఎంతో గొప్పగా మెచ్చుకున్నారు.

జలంధరుడు, ఐదవనాడు మంగళ స్నానంచేసి, నూతన వస్త్రాలు ధరించి, ఉత్సాహంతో ఉప్పొంగిపోతూ, సభ తీర్చాడు. ఆయన సభాముఖంగా, మరొక సారి సునందుడికి కృతజ్ఞతలు తెలియజేసుకుని, సుముహూర్తం చూసి, త్వరలో అతడిని అర్ధరాజ్యాభిషిక్తుణ్ణి చేస్తానని ప్రకటించాడు.

అంతవరకూ మౌనంగా వూరుకున్న సునందుడు, తర్వాత రాజును ఏకాంతంలో కలుసుకుని, "మహారాజా, నాకు అర్ధ రాజ్య పట్టాభిషేకం యిప్పుడు వద్దు. నాకు కొన్నాళ్ళు గడువివ్వండి. తిరిగి నేనే వచ్చి, తమ దర్శనం చేసుకుంటాను," అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత అతడు, కొంతకాలంపాటు, ఒక గురువువద్ద, అస్త్ర విద్య అభ్యసించాడు. రాజును అడిగి తీసుకున్న ధనం, అతడి జీవనభృతికీ, విద్యాభ్యాసానికీ సరిపోయింది.

ఈ విధంగా యుద్ధ విద్యలు నేర్చుకున్న తర్వాత, సునందుడు కొంతకాలం పాటు శాస్త్రాలను కూడా అధ్యయనం చేశాడు. అవి కూడా అతడికి బాగానే పట్టుబడ్డాయి.

సునందుడు మారువేషం వేసుకుని, జ్వాలాముఖీ దేవికి జరిగే నవరాత్రోత్సవాలకు వెళ్ళాడు. ఆ తొమ్మిది రోజులూ, అనేక యుద్ధ విద్యల్లోనూ, యితర అంశాల్లోనూ, రాజు సమక్షంలో పోటీలు జరుగుతాయి. సునందుడు, ఆ పోటీలలో జయంతుడు అనే మారుపేరుతో పాల్గొని, పలువురి ప్రశంసలూ, బహుమతులూ పొందాడు.



ఉత్సవాల అనంతరం, సునందుడు రాజును కలుసుకుని, తానెవరైనదీ చెప్పాడు. రాజు ఆశ్చర్యానందాలు పొందాడు.

సునందుడు వినయంగా, "మహారాజా, పోటీలలో నేను ప్రదర్శించిన శౌర్య ధైర్యాలు, తమ మెప్పు పొందినవని అనుకుంటున్నాను. లోగడ మీరు, నాకు యిస్తానన్న అర్ధరాజ్యానికి బదులు, వేరొక కోరిక కోరదలిచాను," అన్నాడు.

జలంధరుడు, అతడి మాటలకు ఆశ్చర్యపడి, "సరే, ఏమిటా కోరిక?" అని ప్రశ్నించాడు.

"రాకుమారి సుచరితాదేవికి అంగీకారమైన పక్షంలో, ఆమెను వివాహమాడాలని, నా కోరిక!" అన్నాడు సునందుడు.

జలంధరుడు విభ్రమంచెంది, "ఆమె అంగీకరించకపోతే?" అని ప్రశ్నించాడు.

"అప్పుడు నేను, అర్ధరాజ్యాన్ని కూడా వదులుకుని, వెళ్ళిపోతాను," అన్నాడు సునందుడు.

సునందుడికున్నది, సుచరిత మీద ప్రేమో, లేక ఆమెద్వారా లభించబోయే, జ్వాలాముఖీ దేశ సార్వభౌమాధికారం మీది కాంక్షో—జలంధరుడికి అర్థం కాలేదు. అందువల్ల ఆయన, యీ సమస్యను సుచరితకే వదిలిపెట్టడానికి నిశ్చయించుకుని, సునందుణ్ణి తర్వాత రమ్మన్నాడు.

తండ్రి ద్వారా జరిగినది విన్న సుచరిత, "సునందుడి ధోరణి సరిగా అర్థంకావడం లేదు. స్వయంగా మాట్లాడతాను. అతణ్ణి రేపు వచ్చి, నన్ను చూడవలసిందిగా చెప్పండి," అన్నది.

మర్నాడు సునందుడు రాగానే, సుచరిత అతణ్ణి, "సునందా, నీకు సూర్యుడి గౌరవం కావాలా? చంద్రుడి గౌరవం కావాలా?" అని ప్రశ్నించింది.

సునందుడు కొద్దిసేపు మౌనంగా వూరుకుని, "రాకుమారీ, నన్ను క్షమించండి! నేను సూర్యుడిలాగే జీవన యాత్ర

సాగిస్తాను,'' అని, తలవంచుకుని వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, అంత శ్రమపడి విద్యాభ్యాసం చేసిన సునందుడు, అర్ధరాజ్యాన్ని కూడా తిరస్కరించడం, అవివేకం, వివేచనాజ్ఞానం లేక పోవడం, అనిపించుకోదా? అసలతడు, సుచరితను వివాహమాడ గోరింది దేనికి? సుచరిత అడిగినప్పుడు, సూర్యుడిలాగే జీవనయాత్ర సాగిస్తానని చెప్పిన సునందుడు, సూర్యుడిలా తేజోవంతమైన రాజ పదవిని ఎందుకు వదులుకున్నాడు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రాజు కాగోరినవాడు, ఒక్క యుద్ధ విద్యలు నేర్చితే చాలదు. రాజనీతి, మంత్రాంగాలూ తెలిసి వుండాలి. అవసరార్థం ఎత్తుకు, పై ఎత్తు వేయగలగాలి. తనకు అలాంటి రాజధర్మాలు తెలియవని, సునందుడు గ్రహించాడు. అయితే, రాజవైభోగాన్ని అంత తేలికగా వదులుకోలేక, సుచరిత సహాయంతో, తన లోటుపాట్లు, ఇతరులకు తెలియకుండా దాచవచ్చనుకున్నాడు. ఇక, సుచరిత సూచించినది, సూర్యుడి కోటి ప్రభల తేజస్సును కాదు; సూర్యుడి స్వయం ప్రకాశకత్వాన్నీ, చంద్రుడి పరాధీన ప్రకాశకత్వాన్నీ. ఆమె మాటల్లో— స్వయంబుద్ధిలేని నిన్ను, నేనెలా అంగీకరిస్తానన్న తిరస్కారం వున్నదీ. దానితో బాటు, ఒకరి బుద్ధిబలంతో వెలగాలని ప్రయత్నించక, నీ స్వయబుద్ధితో స్వతంత్రంగా జీవించడం మంచిదన్న హితవు కూడా వున్నది. ఇది అర్థం చేసుకున్న సునందుడు, తన విద్యార్హతలకు తగిన ఉద్యోగం ఎక్కడైనా సంపాయించి, జీవయాత్ర సాగించవచ్చునని వెళ్ళిపోయాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# అద్దం

చాలాకాలం క్రితం ఒక కుగ్రామంలో వాంగ్ అనేవాడుండేవాడు. అది ఎంత కుగ్రామమంటే దాని సమీపంలో రహదారి అన్నది లేదు. అక్కడి మనుషులు అమాయకులు. వాళ్ళందరిలోకీ అమాయకుడు వాంగ్.

ఒకసారి వాంగ్ బొగ్గుల కావడితో పట్టణానికి బయలుదేరాడు. అక్కడ బొగ్గులకు మంచి గిరాకీ అని ఆ ఊరివాళ్ళు చెప్పారు. వాంగ్ ఎన్నడూ ఊరు విడిచి వెళ్ళినవాడు కాడు.

వాంగ్‌ను అతని భార్య ఊరి చివర దాకా సాగనంప వచ్చి, "క్షేమంగా వెళ్ళి లాభంగా రా! వచ్చేటప్పుడు నాకో దువ్వెన్న పట్టుకురా!" అన్నది.

"దువ్వెన్నా?" అన్నాడు వాంగ్ ఆశ్చర్యంగా. అతను ఆ మాట కూడా ఎన్నడూ వినలేదు. ఆ రోజుల్లో చీనా స్త్రీలు తలలో పెట్టుకునే దువ్వెనలు కొయ్యవి: వంపు తిరిగి ఉండేవి.

"అదుగో, అలా వుంటుంది." అంటూ వాంగ్ భార్య తూర్పున వెలాతెలా పోతున్న నెలవంకను చూపింది.

బొగ్గు సాంతం అమ్ముడయిన రోజు సాయంకాలం అతను పట్టణం నడిబజారులో, జనసమ్మర్దం మధ్యగా నడుస్తూ ఉండగా, అకస్మాత్తుగా అతనికి తన భార్య తెమ్మన్నది జ్ఞాపకం వచ్చింది. కాని దాని పేరు గుర్తు రాలేదు. దాని సంకేతం ఆకాశంలో ఉంటుందన్న మాట లీలగా స్ఫురించి, వాంగ్ తూర్పు ఆకాశం కేసి చూశాడు. అక్కడ గుండ్రని చందమామ కనిపించింది. తన భార్య కోరిన గుండ్రని వస్తువు ఏమై ఉంటుందా అని అతను ఆలోచిస్తూండగా ఎదురుగా ఉన్న దుకాణంలో ఒక గుండ్రని వస్తువు కనబడింది.

చీనా జానపద కథ

వెంటనే వాంగ్ దుకాణం వాడు చెప్పిన ధరకు ఆ వస్తువును కొని, ఇంటికి బయలుదేరాడు.

తిరుగు ప్రయాణం కూడా చాలా రోజులు పట్టింది; అయినా వాంగ్ క్షేమంగానే ఇంటికి చేరుకుని, తాను తెచ్చిన వస్తువు తన భార్య కిచ్చాడు. అది అద్దం.

వాంగ్ భార్య ఆత్రంగా గుడ్డ విప్పి అద్దం పైకి తీసి, దాని కేసి చూసింది. అందులో ఆమెకు తన ప్రతిబింబం కనిపించింది. ఆమెకు అద్దమంటే ఏమిటో తెలియదు. ఆ మాట కొస్తే, ఆ గ్రామంలో ఎవరూ అద్దం ఎలా ఉంటుందో ఎరగరు. అందుచేత వాంగ్ భార్య, తన భర్త పట్టణం నుంచి ఇంకో భార్యను తెచ్చుకున్నా డనుకున్నది.

ఆమె ఆ అద్దం పట్టుకుని, ఆ గ్రామంలోనే ఉన్న తన పుట్టింటికి ఏడుస్తూ వెళ్ళి, తన తల్లికి అద్దం ఇస్తూ, ''చూడు, నీ అల్లుడు పట్నం పోయి ఇంకో పెళ్ళాన్ని తెచ్చుకున్నాడు!'' అన్నది.

ఆమె తల్లి అద్దంలో తన ప్రతిబింబం చూసి, ''ఇంకో పెళ్ళాన్ని తెచ్చుకోదలిచినవాడు, పడుచుదాన్ని కాక వయసు మళ్ళినదాన్ని తెచ్చుకున్నాడేమే?'' అన్నది.

నలుగురూ పోయి గ్రామాధికారికి ఫిర్యాదు చెయ్యాలిసిందే నన్నారు. గ్రామాధికారి, వాంగ్‌నూ, అతనిభార్యనూ, అత్తగారినీ పిలిపించి, వాంగ్ తెచ్చిన అద్దంలోకి చూశాడు. అందులో మరొక గ్రామాధికారి లాంటివాడు కనిపించాడు.

''నా మీద పోటీకి వీణ్ణి తెస్తారా? ఉండండి, మీ మదం అణుస్తా!'' అని గ్రామాధికారి ఫిర్యాదీలనూ, ముద్దాయినీ కొరడాలతో కొట్టమని భటుడితో అన్నాడు.

ఈ అన్యాయానికి అందరూ ఒక్కసారి గొల్లుమన్నారు. గ్రామాధికారి అబద్ధం చెబుతున్నాడని అద్దం పట్టుకుని నలుగురూ ఒకసారే లాగారు.

ఈ గలభాలో అద్దం కాస్తా కిందపడి ముక్కలైపోయింది. దానితో అందరి కష్టాలూ కడతేరాయి.



మనదేశపు అద్భుతాలు :

# సాంచీస్తూపం




మధ్యప్రదేశ్ రాజధాని భోపాల్ నగ రానికి సమీపంలో సాంచీ పర్వతాలు ఉన్నాయి. ఇక్కడ క్రీ. పూ. 3వ శతాబ్దంలో అశోకచక్రవర్తి అద్భుతమైన బౌద్ధస్తూపాలను నిర్మించాడు.



ఈ స్తూపాలకు సమీపంలో అతి ప్రాచీన మైన విదిశానగరం ఉన్నది. అశోక చక్రవర్తి కుమారుడైన మహేంద్రుడు, బౌద్ధమత ప్రచారం కోసం సింహళ దేశానికి వెళ్ళేముందు, విదిశాగిరి సమీపంలో కొంతకాలం ధ్యానంలో గడిపాడు. ఆ సమయంలో మహేంద్రుడి తల్లి అతని సంరక్షణాభారం వహించింది.

అనాడు అక్కడొక చిన్న స్తూపం మాత్రం ఉండేది. ఆ తరవాత కొన్నాళ్ళకు అశోకచక్రవర్తి ఆ ప్రదేశానికి వచ్చి, ఆ సుందర ప్రశాంత వాతావరణానికి ముగ్ధుడై, అక్కడ బౌద్ధభిక్షువులకు ఆరామాన్ని నిర్మించడానికి పూను కున్నాడు.





భవన నిర్మాణానికి కావలసిన శిల్పాలను సమకూర్చే పని, విదిశానగర శిల్పులకు అప్పగించబడింది. బుద్ధుడి జీవితానికి సంబంధించిన ఘట్టాలను, వివిధ గాథలను చిత్రించే అద్భుతమైన శిలా శిల్పాలు, శిల్పులు చెక్కారు.

కొన్నాళ్ళకు ఆ స్థలం, వందలాది బౌద్ధ
భిక్షువులకు నివాసస్థానమయింది.
ఎందరో బౌద్ధ భిక్షువులు, అక్కడ
ధ్యాన, పఠనాది కృత్యాలు నిర్వహించే
వారు. మనశ్శాంతి కోసం, జ్ఞాన సము
పార్జన కోసం మరెందరో అక్కడికి
రాసాగారు.





పదమూడవ శతాబ్దానంతరం, ఏ కారణం
వల్లనో, బౌద్ధ భిక్షువులు ఈ ప్రదేశాన్ని
వదిలిపెట్టారు. క్రమేణా ఈ కట్టడాలను
చెట్టుచేమలు, ముళ్ళపొదలు అలము
కుని, ఈ ప్రదేశం అడవిలా తయా
రయింది. ఇక్కడి స్తూపాలు ఎవరి
కంటికీ కనబడనంతగా పొదలు దట్టంగా
మూసుకుపోయాయి.

1818వ సంవత్సరంలో బ్రిటిష్ సేన,
ఈ కొండల గుండా వెళుతూండగా,
సేనానాయకుడు, జనరల్ టేయ్‌లర్,
ఈ కొండ విచిత్ర అకారాన్ని చూసి,
ఆశ్చర్యంతో దానిని సమీపించి, చెట్టు
చేమల మధ్య దాగి ఉన్న స్తూపాన్ని
కనుగొని, అమితానందం చెందాడు.





శతాబ్దాల తరబడి కనుమరుగయి ఉండిన, అద్భుత భవనాలు క్రమ క్రమంగా వెలుగులోకి వచ్చాయి. ప్రధాన స్తూపానికి దాదాపు 10 కి. మీ. దూరంలో బుద్ధుడి శిష్యులయిన సారిపుత్ర, మౌద్గలాయనుల అవశేషాలు లభించాయి.

స్తూపానికి నాలుగు వైపులా, అద్భుతమైన శిల్పకళతో వెలుగొందుతున్న నాలుగు సింహ ద్వారాలు ఉన్నాయి. రెండువేల సంవత్సరాల క్రితం ఇవి నిర్మించబడినవి.





స్తూపకుడ్యాలపై, బుద్ధుడి జీవిత ఘట్టాలను, విశేషాలను చిత్రించే అనేక శిల్పాలు ఉన్నాయి. బుద్ధుడికి, ఒక కోతి, తేనె ఇస్తున్నట్టు ఉన్న శిల్ప చిత్రం ఇక్కడ చూపబడింది. ఇందులో బుద్ధుడి విగ్రహం లేదు. కాని, బోధి వృక్షం ఉన్నది. సువిశాలమైన సుందర ప్రదేశం మధ్య వెలుగొందుతున్న సాంచీస్తూపం, భారతీయ సంస్కృతిని గుర్తు చేసే అద్భుత చిహ్నం!




శ్రీముఖుడు గొప్ప సంపన్నుడు. అతడి నలభైయ్యో ఏట భార్య మరణించింది. వాళ్ళకు సంతానం లేదు. పోయిన భార్యను గురించి, ఎంతకూ వదలని దిగులు కారణంగా, ఆయన మళ్లీ పెళ్ళి చేసుకోలేదు. కాలం గడిచింది. ఇప్పుడాయన ఎనభైఏళ్ళ వృద్ధుడు.

గత ఇరవైఏళ్ళుగా, శ్రీముఖుడికి, గోపాలుడు, మల్లమ్మ అనే భార్యాభర్తలు సేవచేస్తున్నారు. వాళ్ళకాయన నెల జీతాలు యిస్తూండేవాడు. వాళ్ళిద్దరూ, ఇంటి ఆవరణలోని పూరిపాకలో వుంటూండేవాళ్ళు. పేరుకు పనివాళ్ళే అయినా, ఆ భార్యాభర్తలు శ్రీముఖుణ్ణి కన్న తండ్రిలా చూసుకునేవారు.

ఇలా వుండగా, దూరగ్రామంలో వున్న శ్రీముఖుడి అక్క కుమారుడు నారాయణ, అతడి భార్య మాలతి, చుట్టపుచూపుగా వచ్చి, ఆయన ఇంట తిష్ఠవేశారు. వాళ్ళు క్రమంగా పనివాళ్ళిద్దరి మీదా—వాళ్ళు చిన్న, చిన్న దొంగతనాలు చేస్తున్నారనీ, పనీపాటుల్లో తగిన శ్రద్ధ చూపడం లేదనీ, అబద్ధాలు చెప్పి, శ్రీముఖుడికి వాళ్ళపట్ల అయిష్టత కలిగించారు.

ఈ చెప్పుడు మాటలు శ్రీముఖుడికి బాగా తలకెక్కి, ఒక నాడాయన గోపాలుణ్ణీ, మల్లమ్మనూ పనిలో నుంచి తొలగించాడు. ఆనాటి నుంచీ, ఆ ఇంట పూర్తి పెత్తనం, నారాయణా, అతడి భార్యదయ్యింది. వాళ్ళు శ్రీముఖుడికి, యీ వృద్ధాప్య దశలో, తమ లాంటి బంధువులు దగ్గిర వుండి, మంచిచెడ్డలు చూడడం అవసరం అని నమ్మించారు. సంతానం లేని శ్రీముఖుడు, తన తదనంతరం, ఆస్తినంతా మేనల్లుడు నారాయణ పేర రాయాలనుకున్నాడు.

రాంబాబు



ఈ విధంగా, మాలతీ, నారాయణల పథకం పారింది. వాళ్ళు శ్రీముఖుడి ఆస్తి కోసమే ఇంట చేరినవాళ్ళు గనక, ఆయన అవసరాల విషయంలో, క్రమంగా అశ్రద్ధ చూపసాగారు. ఈ వృద్ధుడు ఎంత త్వరగా పోతే, అంత మేలన్న ఆలోచన వాళ్ళ మనసుల్లో వున్నది.

శ్రీముఖుడికి వాళ్ళ నుంచి వేళకు భోజనం అందేదికాదు. అంతే కాక, భోజనంలో ఆయన తినకూడని పదార్థాలుండేవి కూడా. ఈ కారణం చేత, త్వరలోనే శ్రీముఖుడు జబ్బుపడి మంచం పట్టాడు.

ఈ స్థితిలో ఆయన, తన స్నేహితుడైన కోదండపాణి అనే వైద్యుడికి కబురు చేశాడు. కోదండపాణి, శ్రీముఖుణ్ణి పరీక్ష చేసి, "ఎన్నాళ్ళుగా నీకి జ్వరం, చేతులు వణకడం?" అని ప్రశ్నించాడు.

"నాలుగు రోజులుగా, నానా బాధా అనుభవిస్తున్నాను. మంచం దిగలేదనుకో! ఇక లాభం లేదని, నారాయణతో నీకు కబురుపెట్టాను," అన్నాడు శ్రీముఖుడు బాధగా.

కోదండపాణి ఆశ్చర్యపోయి, "నాలుగు రోజుల తర్వాత, నువ్వు చెపితేగాని, నీ మేనల్లుడికి, నీ ఆరోగ్యం బాగా లేదని తెలియలేదన్న మాట!" అన్నాడు.

శ్రీముఖుడు ఏదో అనబోయేంతలో, నారాయణ పెరటి తలుపు తెరుచుకుని లోపలికి వచ్చి, "ఈ వయసులో మామయ్యకు, మందులు పని చేస్తవనే నమ్మకం, నాకు లేదు. ఉట్టినే శరీరాన్ని హైరానపెట్టుకోవడం తప్ప." అన్నాడు.

కోదండపాణి వచ్చే కోపాన్ని తొక్కిపట్టి, "మానవప్రయత్నం అన్నారు గదా, చూద్దాం!" అంటూ వెంట తెచ్చిన పెట్టెలోంచి, ఒక మందు సీసాతీసి, "శ్రీముఖా, ఇక కళ్ళు మూసుకుని పడుకో, భయం లేదు. ఈ ఔషధాన్ని రోజుకు ఎన్నిసార్లు, ఎంత యివ్వాలో, నీ మేనల్లుడికీ, ఆయన భార్యకూ చెప్పిపోతాను," అంటూ వీధి వాకిట్లోకి వచ్చాడు.

నారాయణా, మాలతీ ఆయన వెనకనే వచ్చారు. కోదండపాణి ఔషధం సీసాను వాళ్ళకు యిచ్చి, దాన్ని రోజుకు ఎన్ని మార్లు, ఏ మోతాదులో యివ్వాలో చెప్పి, వెళ్ళిపోయాడు.

మూడు రోజులుగడిచేసరికి, శ్రీముఖుడు పూర్తి ఆరోగ్యవంతుడయ్యాడు. ఆయన ఒక సాయంత్రం కోదండపాణిని చూడ బోయి, "పాణీ, నీవిచ్చినమందు సంజీ వనిలా పని చేసింది. జబ్బు పడకముందు, నాలో వున్న ఓపిక్కంటే, యిప్పుడు ఎక్కువ ఓపిగ్గా వున్నాను," అన్నాడు.

"చాలా సంతోషం, శ్రీముఖా! ఈ సంగతి చెప్పు. నేనిచ్చిన ఔషధాన్ని, నీ మేనల్లుడూ, అతడి భార్యా రోజు కెన్ని సార్లు యిచ్చారు?" అని అడిగాడు కోదండపాణి.

"నారాయణా, మాలతీ, ఈ మూడు రోజులూ, రోజుకు మూడుసార్లు చొప్పున, ఆరు చెంచాల ఔషధాన్ని, వేళకు మరిచి పోకుండా యిస్తూ, నన్ను కంటికి రెప్పలా చూసుకున్నారు," అన్నాడు శ్రీముఖుడు.

కోదండపాణి కోపంగా, "అదా సంగతి! నువ్వు తక్షణం, వాళ్ళను వాళ్ళ ఊరుకు పంపించెయ్యి. అలా చేయకపోయావో, నీ ప్రాణానికే ముప్పు. వాళ్ళకొక్కవలసింది, నీ ఆస్తిపాస్తులు తప్ప, నువ్వుకాదు. రోజుకు మూడుసార్లు చొప్పున, మూడు చెంచాలకు మించి ఔషధం యివ్వవద్దని, వాళ్ళకు చెప్పాను. మూడు చెంచాలకు



మించి ఔషధం యివ్వడం, ప్రాణానికే ముప్పని హెచ్చరించాను," అన్నాడు.

"అలాగా!" అని శ్రీముఖుడు ఆశ్చర్యపోయి, "నువ్వు చెప్పిన మోతాదుకు మించి యిచ్చినా, నాకెలాంటి ప్రమాదం జరగలేదెందుకని?" అని ప్రశ్నించాడు.

దానికి కోదండపాణి నవ్వి, "నిజానికి, ఆ ఔషధం కొంత ఎక్కువగా తీసుకున్నా, మేలేగాని కీడు చెయ్యదు. వాళ్ళ నిజ స్వరూపం తెలుసుకునేందుకు, వాళ్ళతో అలా చెప్పాను. ఇప్పుడు గ్రహించావా, వాళ్ళు నీ యింట ఎందుకు చేరారో?" అన్నాడు.

కోదండపాణి చెప్పినది విన్నాక, తనకు ఇరవై ఏళ్ళపాటు ఎంతో ఆప్యాయంగా సేవచేసిన గోపాలుడూ, మల్లమ్మా, శ్రీముఖుడికి గుర్తువచ్చారు.

"నా మేనల్లుడూ, వాడి భార్యా నక్కజిత్తుల కారణంగా, గోపాలుణ్ణీ, మల్లమ్మనూ పని నుంచి తొలగించాను. అలాంటి వాళ్ళు మళ్ళీ నాకు దొరికితే, ఎంత బావుండును!" అన్నాడు శ్రీముఖుడు దిగులుగా.

కోదండపాణి, ఆయన భుజం తట్టి, "వాళ్ళిద్దరూ, నా దగ్గిరే వుండి, ఆకులూ, మూలికలూ తేవడంలో, మందులు నూరడంలో సహాయపడుతున్నారు. నువ్వు మంచాన పడిన సంగతి విని, వాళ్ళు పడిన ఆదుర్దా, అంతా యింతా కాదు. పని మీద బయటికి పోయారు. తిరిగి రాగానే, అవసరం అనుకుంటే, నీ ఇంటికి తీసుకుపో," అన్నాడు.

"అవసరమా? వాళ్ళు, నా కొడుకూ, కోడలురా, పాణీ! వస్తాను," అంటూ శ్రీముఖుడు, అప్పటికప్పుడే బయలుదేరి, మర్నాటి వేకువజామునే నారాయణ చేతా, అతడి భార్య చేతా, వాళ్ళ ఊరుకు ప్రయాణం కట్టించాడు.

తర్వాత గోపాలుడూ, మల్లమ్మా తిరిగి ఆయన ఇంటికి వచ్చి, వృద్ధుడైన శ్రీముఖుడికి ఎలాంటి కొరతా కలక్కుండా చూడసాగారు.






లక్ష్మణుడు ఏమీ మాట్లాడలేక, ఏడుస్తూ సీతకు సాష్టాంగ నమస్కారం చేసి, ఆమె చుట్టూ ప్రదక్షిణం చేసి, పడవలో ఎక్కి ఉత్తర తీరానికి చేరుకుని, రథ మెక్కి, అనాథురాలి లాగా అవతలి ఒడ్డున ఏడుస్తున్న సీతను మళ్ళీ మళ్ళీ వెనక్కి తిరిగి చూస్తూ వెళ్ళిపోయాడు. సీత ఆ రథంకేసే చూస్తూ ఉండిపోయి, పట్టలేక గట్టిగా ఏడవ నారంభించింది. ఆమె ఏడుపుకు నిర్జనమైన అరణ్యం మారుమోగింది.

ఆ నిర్జనారణ్యంలో ఒంటరిగా ఏడుస్తున్న సీతను కొందరు మునికుమారులు చూసి, వాల్మీకి వద్దకు పరిగెత్తి వెళ్ళి, ''స్వామీ, గంగా తీరాన ఎవరో ఒక స్త్రీ ఏ కారణం వల్లనో ఏడుస్తూ కనబడింది. మనిషి చూడబోతే ఆకాశం నుంచి దిగి వచ్చిన దేవతాస్త్రీ లాగా ఉన్నది. ఆమె కెవరూ ఉన్నట్టు లేరు. మీరు వెంటనే వెళ్ళి ఒక సారి చూడండి,'' అని చెప్పారు.

వాల్మీకి మహాముని, తన శిష్యులు వెంట రాగా, అర్ఘ్యం తీసుకుని సీత ఉన్న చోటికి వచ్చి, ఆమెను గుర్తించి, ''దశరథుడి కోడలికి స్వాగతం. అమ్మా, నీ విక్కడికి ఎలా చేరావో అది నేను నా శక్తిచేత గ్రహించాను. మూడు లోకాల వృత్తాంతాలూ నాకు తెలుస్తూనే ఉంటాయి. నేనుండగా నీకే భయమూ లేదు. నా ఆశ్రమం దగ్గిరలోనే ఉన్నది. అక్కడ తాపస స్త్రీలున్నారు. వారు నిన్ను కంటిని

9. సీత వాల్మీకి ఆశ్రమ ప్రవేశం



రెప్పలా కనిపెట్టి ఉంటారు. దుఃఖించకు. ఈ అర్ఘ్యం తీసుకో. మా ఆశ్రమంలో నీవు నీ సొంత ఇంట్లో ఉన్నట్టే ఉండవచ్చు,'' అన్నాడు.

సీత ఆయనకు నమస్కారం చేసి, వాల్మీకి వెంట ఆయన ఆశ్రమం ప్రవేశించింది. వాల్మీకి ఆమెను ముని భార్యలకు అప్పజెప్పి, ఆమెను స్నేహ గౌరవాలతో చూడవలసిందని చెప్పాడు.

అయోధ్యకు తిరిగి పోతున్న లక్ష్మణుడు సుమంత్రుడితో, ''సుమంత్రా, అన్నకు సీతా వియోగం వల్ల ఎంతటి దుఃఖం సంప్రాప్తమయిందో చూశావు గదా. నిర్దోషురాలైన మహాసాధ్వి సీతకు ఎంత కష్టం వచ్చిందో చూడు,'' అన్నాడు ఎంతో బాధగా.

సుమంత్రు డా మాటకు, ''లక్ష్మణా, రాముడికి సుఖం అల్పమనీ, అయినవారితో వియోగం కలుగుతుందనీ పూర్వం మునులు చెప్పనే చెప్పారు. ఇది చాలా రహస్యం. నేను నీకు చెబుతాను, కాని నీవు మాత్రం ఈ రహస్యాన్ని భరత శత్రుఘ్నులకు చెప్పకు,'' అంటూ ఇలా చెప్పాడు:

ఒకనాడు దశరథుడు వసిష్ఠుడి ఆశ్రమానికి వెళ్ళేసరికి అక్కడ అత్రిమహాముని కుమారుడైన దుర్వాసు డున్నాడు. దశరథుడు మునుల నుంచి స్వాగత సత్కారాలు పొంది, మాటల సందర్భంలో దుర్వాసుణ్ణి, ''మహాత్మా, నా సంతతి యొక్క భవిష్యత్తు ఎలా ఉండబోతుంది? మా రాముడి ఆయుర్దాయ మెంత? మిగిలిన నా కొడుకు లెంత కాలం జీవిస్తారు? మా రాముడి కెంతమంది కొడుకు లుంటారు? వా రెంత కాలం జీవిస్తారు?'' అని అడిగాడు. ఆ ప్రశ్నలకు సమాధానంగా దుర్వాసుడు ఒక పాత గాథ చెప్పాడు.

దేవాసుర యుద్ధంలో ఓడిపోయి అసురులు భృగుమహాముని భార్యను శరణు జొచ్చారు. ఆమె వారికి అభయం

ఇచ్చింది. ఇది చూసి విష్ణువు ఆగ్రహించి, భృగుడి భార్య శిరస్సును తన చక్రాయుధంతో ఖండించాడు. వెంటనే భృగు మహాముని మండిపడి, విష్ణువును భూలోకంలో పుట్టి తనలాగే భార్యావియోగంతో తపించమని శపించాడు. ఆ శాపప్రభావం చేత విష్ణువు భూలోకంలో దశరథుడి కొడుకుగా పుట్టి, రాముడనే పేరుతో ప్రసిద్ధి చెందాడు.

"రాముడు భృగు శాపఫలం అనుభవించి తీరుతాడు. అతను పదకొండు వేల ఏళ్ళు అయోధ్యను పాలించి, అనేక అశ్వమేధాలు చేసి, బ్రహ్మలోకానికి పోతాడు. అతనికి ఇద్దరు కొడుకులు పుడతారు, అయితే వారు అయోధ్యలో గాక మరొకచోట పుడతారు. వారికి రాముడు పట్టాభిషేకం చేస్తాడు." అని దుర్వాసుడు దశరథుడితో చెప్పాడు.

ఇలా మాట్లాడుకుంటూ, లక్ష్మణ సుమంత్రులు సాయంకాలానికి గోమతి అనే చోటికి వచ్చి ఆ రాత్రి అక్కడ గడిపారు. మర్నాడు ఉదయం వారు తిరిగి ప్రయాణం సాగించి అయోధ్యకు వెళ్ళేటప్పుడు లక్ష్మణుడు, రాముడితో ఏమని చెప్పటమా అని చాలా మథనపడ్డాడు.

రథం అయోధ్య చేరింది. రాముడి ప్రాసాదం ముందు లక్ష్మణుడు రథం దిగి, లోపలికి వెళ్ళి, దీనంగా కన్నీరు కార్చుతూ, సింహాసనం మీద కూర్చుని ఉన్న రాముడికి నమస్కరించి, "మీ





అజ్ఞానుసారం సీతను గంగాతీరాన వాల్మీకి మహాముని ఆశ్రమంలో విడిచి వచ్చాను. విచారించవద్దు. వృద్ధి నుంచి క్షయమూ, ఉన్నతి నుంచి పతనమూ, సంయోగము నుంచి వియోగమూ తప్పవు. వచ్చిన అపవాదు దానంతట అదే పోతుంది,'' అన్నాడు.

''లక్ష్మణా, నా మాట పాటించావు. చాలా సంతోషం. నీవు అనుకుంటున్నట్టు నాకు విచారమేమీ లేదు,'' అన్నాడు రాముడు గంభీరంగా. అప్పటి కతను నాలుగు రోజులుగా ప్రజల గొడవలు విచారించలేదు. అది చాలా తప్పు. రాముడా సంగతి లక్ష్మణుడితో అని, అందుకు తార్కాణంగా నృగమహారాజు కథ యిలా చెప్పాడు:

పూర్వం నృగమహారాజు కోట్లకొద్దీ ఆవులను బ్రాహ్మణులకు దానం చేశాడు. ఆయన దాన మిచ్చిన ఆవులలో ఒకటి ప్రమాద వశాన తిరిగి రాజుగారి ఆవుల మందలలో కలిసిపోయింది. అది తెలియక రాజు దాన్ని మరొక బ్రాహ్మణుడికి దాన మిచ్చాడు. మొదట దానం పుచ్చుకున్న బ్రాహ్మణుడు తన ఆవును వెతుక్కుంటూ తిరుగుతూ, కనఖలం అనే చోట రెండో బ్రాహ్మణుడి ఇంట తన ఆవును చూసి గుర్తించి, దానికి తాను పెట్టుకున్న పేరుతో పిలిచాడు. ఆ ఆవు తన పాత యజమాని గొంతు గుర్తించి, కట్టుతాడు తెంచుకుని, అతని వెంట బయలుదేరింది. అది చూసి రెండో బ్రాహ్మణుడు, ''నా ఆవును నువు తోలుకు పోతున్నావేమిటి? దీన్ని నాకు నృగమహారాజు దాన మిచ్చాడు,'' అన్నాడు.

''ఆ నృగమహారాజే దీన్ని నాక్కూడా దాన మిచ్చాడు,'' అన్నాడు మొదటి బ్రాహ్మణుడు. ఈ తగాదా వారిద్దరి మధ్యా పరిష్కారం అయేది కాదు గనక వారు తిన్నగా నృగమహారాజు వద్దకే వెళ్ళారు. అయితే వారికి రాజదర్శనం ఎంతకూ కాలేదు. బయటి ద్వారం వద్ద

రోజుల తరబడి పడిగాపులు కాయవలసి వచ్చింది. చివరకు వాళ్ళు ఆగ్రహించి, ఊసరవెల్లి అయిపోయి ఎవరి కంటా పడకుండా గోతిలో జీవించమని రాజును శపించారు. రాజు బతిమాలగా, యదు వంశంలో వాసుదేవుడు పుట్టి శాపవిమోచనం కలిగిస్తాడని చెప్పి ఆ బ్రాహ్మణులు వెళ్ళిపోయారు.

తరవాత నృగమహారాజు వసు వనే తన కుమారుడికి పట్టాభిషేకం చేసి, తాను ప్రజల కంటపడకుండా ఊసరవెల్లి జీవితం సుఖంగా గడపటానికిగాను కొన్ని గోతులు తవ్వించి, వాటి మీద చెట్ల నీడా, వాటి చుట్టూ పూలమొక్కలూ ఏర్పాటు చేయించుకున్నాడు.

రాముడు లక్ష్మణుడికి నృగమహారాజు కథ చెప్పి, ఆ తరవాత నిమి అనే వాడి కథ కూడా చెప్పాడు.

నిమి ఇక్ష్వాకు మహారాజు కొడుకులలో పన్నెండోవాడు. అతను ఒక దివ్యమైన పురం కట్టించి, దానికి వైజయంత మని పేరు పెట్టాడు. అతను తన తండ్రికి సంతోషం కలిగించటానికై ఒక యజ్ఞం తలపెట్టి, వసిష్ఠుణ్ణి ఋత్విక్కుగా ఉండమని కోరాడు. అయితే వసిష్ఠుడు తనను ఇంద్రుడు ముందుగానే యజ్ఞం చేయించమని కోరాడనీ, ఇంద్రుడి యజ్ఞం పూర్తి కాగానే తాను వచ్చి నిమి చేత యజ్ఞం చేయిస్తాననీ చెప్పి వెళ్ళిపోయాడు. అందు చేత నిమి గౌతముణ్ణి పెట్టుకుని యజ్ఞం





పూర్తి చేసేశాడు. ఇంద్రుడి యజ్ఞం పూర్తి కాగానే వసిష్ఠుడు తిరిగి వచ్చి, నిమి తన కోసం వేచి ఉండక గౌతముడి చేత యజ్ఞం పూర్తి చేయించుకున్నాడని తెలుసుకుని, అమిత కోపం చెంది, రాజును చూడబోయాడు.

సరిగా ఆ సమయానికి నిమి నిద్రపోతూ ఉండటం జరిగింది. వసిష్ఠుడు రాజదర్శనం కోసం కొద్దిసేపు చూసి, కావాలనే నిమి తనను వేచి ఉంచాడనుకుని, ఆగ్రహం చెంది, "రాజా, మరొకరి చేత యజ్ఞం చేయించుకుని నన్నవమానించావు గనక, నీ శరీరం నిశ్చేతన మగుగాక," అని శపించాడు.

తరవాత రాజు మేలుకుని వసిష్ఠుడిచ్చిన శాపం తెలుసుకుని, "నిద్రపోయే నన్ను శపించిన నీ శరీరం కూడా చేతనం లేనిదైపోవుగాక," అని ప్రతిశాపమిచ్చాడు.

ఇలా ఒకరినొకరు శపించుకుని నిమి వసిష్ఠులు "విదేహు" లయిపోయారు.

అప్పుడు వసిష్ఠుడు తన తండ్రి అయిన బ్రహ్మ వద్దకు వాయురూపం ధరించి వెళ్ళి, "తండ్రీ, నిమి శాపం వల్ల నా దేహం కాస్తా పోయింది. దేహం లేక పోవటం చేత చెప్పలేనంత బాధ, ఏ పనీ చెయ్యటానికి సాధ్యపడటం లేదు. అందు చేత నన్ను అనుగ్రహించి నాకు మరొక శరీరం కలిగేటట్టు చెయ్యి," అని దీనంగా వేడుకున్నారు.

బ్రహ్మ, వసిష్ఠుణ్ణి మిత్రా వరుణుల తేజస్సుతో తిరిగి శరీరాన్ని సంపాదించుకోమన్నాడు. ఆ విధంగా మరొక దేహాన్ని సంపాదించుకున్న వసిష్ఠుడే ఇక్ష్వాకు వంశం వారికి పురోహితుడయాడు.

ఇక నిమి సంగతి: నిమి శరీరాన్ని మునులు రక్షించి, దేహం పోయిన నిమి సమస్త ప్రాణుల కళ్ళలోనూ ఉండేటట్టుగా వరమిచ్చారు. తరవాత వారు నిమి దేహాన్ని మథించగా అందులో నుంచి ఒక పిల్లవాడు పుట్టి మిథి అని పిలవ




బద్దాడు. అతని పేరనే మిథిలానగరం ఏర్పడింది. అతనికి జనకుడని కూడా పేరు.

రాముడు చెప్పిన ఈ కథలు విని లక్ష్మణుడు, ''అన్నా, క్షత్రియుడై ఉండి కూడా నిమి వసిష్ఠుడి లాటి మహాత్ముడి పట్ల ఎందుకు శాంతి వహించలేదు?'' అన్నాడు.

''రోషం మూలాన ఎలాటి వాడైనా శాంతిని కోల్పోవటం సహజం. అలా రోషాన్ని నిగ్రహించుకున్నవాడు ఒక్క యయాతి మాత్రమే,'' అంటూ రాముడు లక్ష్మణుడికి యయాతి వృత్తాంతం ఈ విధంగా చెప్పాడు.

యయాతి నహుషుడి కొడుకు. అతనికిద్దరు భార్యలు. ఒకతె వృషపర్వమహారాజు కుమార్తె అయిన శర్మిష్ఠ, రెండవది శుక్రాచార్యుడి కుమార్తెఅయిన దేవయాని. కాని యయాతికి శర్మిష్ఠ పైన ఉండే ప్రేమ దేవయాని పైన ఉండేది కాదు. అదే విధంగా అతనికి శర్మిష్ఠ కొడుకైన పూరుడి పైన ఉన్నంత మమకారం దేవయాని కొడుకైన యదుడి పైన ఉండేది కాదు. నిజానికి పూరుడు మంచి గుణవంతుడు, ఆపైన శర్మిష్ఠ కొడుకు కూడాను. తన తండ్రి పూరుడి పైన హెచ్చు ప్రేమ చూపటం సహించలేక యదుడు తన తల్లి అయిన దేవయానితో, ''అమ్మా, శుక్రాచార్యుడంతటి వాడి కూతురువై ఉండి నువూ, నీ కొడుకైన నేనూ ఇంత అవమానాన్ని ఎందుకు సహించాలి? మన మిద్దరమూ అగ్నిలో దూకి ప్రాణత్యాగం చేద్దాం. ఈ అవమానాన్ని ఒకవేళ నువు సహించినా, నేను సహించలేను. ఆత్మహత్య చేసుకుంటాను, నాకు అనుజ్ఞ ఇయ్యి,'' అని పెద్దపెట్టున ఏడ్చాడు.

కొడుకు దుఃఖం చూసి దేవయానికి రోషం వచ్చింది. ఆమె తన తండ్రిని తలుచుకున్నది. వెంటనే శుక్రాచార్యుడు వచ్చాడు.

''నా భర్త నన్ను చాలా లోకువగా చూస్తున్నాడు. ఆ అవమానం భరించటం కష్టంగా ఉంది. నేను అగ్నిలో దూకో, విషం తినో, నీటిలో పడో ఆత్మహత్య చేసుకుందా మనుకుంటున్నాను,'' అన్నది దేవయాని తండ్రితో.

శుక్రాచార్యుడికి పట్టరాని ఆగ్రహం వచ్చి, యయాతిని ముసలితనంతో జీవించమని శపించి, కూతురి నోదార్చి, ఇంటికి తిరిగి పోయాడు. శుక్రాచార్యుడి శాపాన్ని యయాతి ఎంతో సహనంతో స్వీకరించాడు.

అతను యదువును పిలిచి, ''నాయనా, నేనింకా భోగాలతో తృప్తిపడలేదు. అందుచేత నా ముసలితనాన్ని నువు కొంతకాలం భరిస్తావా ? నాకు భోగాలతో తృప్తి కలిగాక నీ యౌవనం నీ కిచ్చి ముసలితనం తీసుకుంటాను,'' అన్నాడు.

''నీ సరసన భోజనం చెయ్యటానికి అర్హుడైన పూరు డుండగా నీ ముసలితనాన్ని నే నెందుకు తీసుకోవాలి? వాణ్ణే తీసుకోమను,'' అన్నాడు యదువు కోపంగా.

అప్పుడు యయాతి పూరుణ్ణి పిలిచి యదువు నడిగినట్టే అడిగాడు. తన తండ్రి వార్థక్యాన్ని స్వీకరించటానికి పూరుడు మనస్ఫూర్తిగా అంగీకరించాడు. యయాతి తన ముసలితనాన్ని పూరుడి కిచ్చి, వాడి యౌవనం తాను పొంది, అనేక వేల యజ్ఞాలు చేశాడు, అనేక వేల సంవత్సరాలు రాజ్యం చేశాడు. చివరి కతను తన కొడుకు నుంచి ముసలితనం తీసుకుని, వాడికే రాజ్యాభిషేకం చేసి, దేవయాని కొడుకైన యదువుకు రాజ్యార్హత లేకుండా చేశాడు.

యయాతి అనంతరం పూరుడు ప్రతిష్ఠానపురం రాజధానిగా పెట్టుకుని చాలాకాలం రాజ్యం చేశాడు.

రామలక్ష్మణు లిలా కథలు చెప్పుకుంటూండగానే రాత్రి గడిచిపోయింది. అప్పుడప్పుడే తూర్పున అరుణరేఖలు కనిపించాయి.





# దుష్టపాలన

రుద్రపురరాజ్యాన్ని పాలించే సింహకేతుడు, చాలా క్రూరుడు. ప్రజలమేలు గమనించకుండా, వాళ్ళవద్ద వున్న ధనాన్ని, పన్నుల పేరుతో వసూలు చేసేవాడు. పన్నులు కట్టలేనివారిని దారుణంగా కొరడాలతో కొట్టించడం, తిరగబడిన వారిని ఉరి తీయించడం, అతని పరిపాలనాపద్ధతి.

సింహకేతుడి మంత్రి అయిన, ధర్మచరణుడు వివేకి. ఆయన రాజును సన్మార్గవంతుణ్ణి చేయాలని ఎంతో ప్రయత్నించి విఫలుడయాడు. రాజ్యం అల్లకల్లోలంగా తయారైంది. ప్రజలు, సింహకేతుడి పరిపాలనను రాక్షసపాలనగా పరిగణించసాగారు.

సింహకేతుడికి వేట అంటే చాలా ఆసక్తి. అతడు ఒక రోజు, పదిమంది సైనికులను వెంట బెట్టుకుని, అడవికి వేటకు వెళ్ళాడు. కనపడిన మృగాలను బాణాలతో కొడుతూ, అతడు సైనికుల నుంచి దూరమయ్యాడు.

తను సైనికుల నుంచి దూరమయ్యానని గ్రహించిన సింహకేతుడు, తిరిగి నగరానికి దారివెతుక్కుంటూ వస్తూండగా, నలుగురు దృఢకాయులు, చెట్టు మీది నుంచి వల విసిరి, అతణ్ణి బంధించారు. వాళ్ళు దారిదోపిడి దొంగలు.

దొంగలు, సింహకేతుడు ధరించిన విలువైన ఆభరణాలు లాక్కుని, అతణ్ణి తమ నాయకుడైన, ఉగ్రకంఠుడి వద్దకు తీసుకుపోయారు.

ఉగ్రకంఠుడు, సింహకేతుణ్ణి పరీక్షగా చూస్తూ, ''నిజం చెప్పు! ఎవరు నువ్వు?'' అని ప్రశ్నించాడు.

''నేనీ రాజ్యానికి రాజును; సింహకేతుణ్ణి!'' అన్నాడు సింహకేతుడు.

ఎస్. శివనాగేశ్వరరావు

ఆ జవాబు వింటూనే, ఉగ్రకంఠుడు తన అనుచరులకేసి ఉరిమి చూసి, "ఒరే, మూర్ఖుల్లారా! ఈయనెవరో కాదు, మన వాడే! వెంటనే కట్టు తాళ్ళు ఊడదీయండి," అని ఆజ్ఞాపించాడు.

ఉగ్రకంఠుడు, రాజువద్ద దోచుకున్న ఆభరణాలను, మరుక్షణమే అతడికి యిప్పించి, "క్షమించు. మనమంతా ఒకటే అన్న సంగతి తెలియక, నా అనుచరులు, నిన్ను బంధించారు. ఇక వెళ్ళవచ్చు," అన్నాడు.

ఉగ్రకంఠుడి మాటలు, సింహకేతుడికి ఆశ్చర్యం కలిగించినై. అతడు అక్కడి నుంచి బయలుదేరి, అడవిలో కొంత దూరం వెళ్ళేసరికి, అతడి ముందొక పిశాచప్పు ప్రత్యక్షమైంది. అది గాలిలో కదలాడుతూ, వికటంగా నవ్వసాగింది. సింహకేతుడు ధైర్యంగా, దానికి ఎదురు నిలిచి, ఒర నుంచి కత్తి దూశాడు.

ఆ వెంటనే పిశాచం పెద్దగా నవ్వి, "ఓయీ, వెర్రివాడా! నీ కత్తి పిశాచాల నేం చేయగలదు? నేను కావాలనుకుంటే, క్షణంలో నీ రక్తం పీల్చగలను; కాని నేనలా చేయను. ఎందుకంటే, నేను చచ్చిపోయిన జీవులనే పీక్కుతింటాను. చూడబోతే చాలా ధైర్యశాలిలా వున్నావు. ఎవరు నువ్వు?" అని ప్రశ్నించింది.

అందుకు సింహకేతుడు, "నేను రుద్రపురరాజు సింహకేతుణ్ణి," అని జవాబిచ్చాడు.



అది వింటూనే పిశాచం భయపడి, "నువ్వేనా, సింహకేతుడివి? నువ్వు, మా పిశాచాలను కూడా పీక్కుతినగలిగినంత ప్రమాదకారుడివి. నేను తొందరపడి నీకు హాని చేయలేదు. అలా చేసివుంటే, మాకింత ఆహారం పెడుతున్న నిన్ను చంపిన నేరానికి, మా పిశాచగణం, నాకు శిక్షవిధించేది!" అని, గాలిలో ఎగురుతూ వెళ్ళిపోయింది.

సింహకేతుడు, పిశాచం మాటలకేగాక, అది తనను చూసి భయపడడం గమనించి, ఎంతగానో ఆశ్చర్యపోతూ ముందుకు కదిలాడు.

అతడు కొంతదూరం పోయేసరికి, ఒక చెట్టుపక్క నుంచి, చెవులు దిబ్బెళ్ళుపడేలా, భీకరమైన కేక వినబడింది. సింహకేతుడు అదిరిపడి, తలతిప్పి చూశాడు. అంతలో చెట్టుపక్కన కూర్చుని వున్న రాక్షసుడొకడు, చప్పున చేయిచాచి అతణ్ణి గుప్పెట్లో బిగించి పట్టుకున్నాడు.

"ఒరే, మనిషీ! ఆకలిగా వుంది. సమయానికి వచ్చావు," అంటూ రాక్షసుడు, సింహకేతుణ్ణి మింగబోయినవాడల్లా ఆగి, "ఒరే, నీ వేషం చూస్తే, ఎవడో ప్రముఖుడేమో అనిపిస్తున్నది. ఎవరు నువ్వు?" అని ప్రశ్నించాడు.

అందుకు సింహకేతుడు, "నేనీ రాజ్యాన్నేలే రాజును!" అన్నాడు.

ఆ జవాబు వింటూనే రాక్షసుడు, వికవికమంటూ నవ్వి, "నిన్ను చంపడ





మంటే, ఆ తర్వాత నేను ఆకలికి మలమల మాడి చావడమే అవుతుంది. నీవు పది కాలాలపాటు చల్లగా వుండాలని, నాదీవన!'' అంటూ సింహకేతుణ్ణి విడిచి పెట్టాడు.

రాక్షసుడి మాటలు, రాజుకు ఎక్కడ లేని ఆశ్చర్యాన్ని కలిగించాయి. దారి దోపిడి వాళ్ళ నాయకుడు, పిశాచం, రాక్షసుడు—ముగ్గురూ తనను చంపగలిగి కూడా ఎందుకు చంపలేదు? అని ఆలోచిస్తూ, అతడు ఒక చెట్టు కింద కూర్చున్నాడు.

తమ రాజు కోసం, అడవి అంతా గాలిస్తున్న సైనికులు కొంతసేపటికి అక్కడికి వచ్చి, సింహకేతుణ్ణి కలుసుకున్నారు. తర్వాత నగరానికి దారి వెతుకుతూ బయలుదేరి, సాయం సమయానికల్లా నగరం చేరారు.

సింహకేతుడు, మంత్రి ధర్మచరణుడికి కబురు చేసి, అతడు రాగానే, అడవిలో తన అనుభవాల గురించి, అతడికి చెప్పి, ''ఆ ముగ్గురూ నన్ను చంపగలిగి కూడా చంపలేదు. పైగా, దారిదోపిడి వాళ్ళ నాయకుడు, తన వాళ్ళతో, నన్ను 'మనవాడే!' అంటాడు. పిశాచం, మాకు తిండి పెడుతున్నావంటుంది. రాక్షసుడేమో, పది కాలాలపాటు వుండాలని దీవించాడు. ఇందుకు గల కారణాలు, నాకు అర్థం కాలేదు. మీరేమైనా వివరించగలరా?'' అని అడిగాడు.

ధర్మచరణుడు కొద్దిసేపు మౌనంగా వూరుకుని, ''మహారాజా, వివరించగలను. తమరు, నాపై ఆగ్రహించకుండా, అందులోని నిజం గ్రహించేందుకు ప్రయత్నించగలరా?'' అని అడిగాడు.

సింహకేతుడు, అందుకు అంగీకరించాడు. ధర్మచరణుడు ఇలా వివరించాడు: "దొంగల నాయకుడు, మిమ్మలను మనవాడే, అనడంలో వున్న అర్థం— వాళ్ళు, అడవిమార్గాన పోయేవాళ్ళను దోచుకుంటూ వుంటే, మీరు రాజ్యంలోని

వాళ్ళను దోచుకుంటున్నారని. అంటే— మీకూ, వాళ్ళకూ భేదం లేదని, అతడి భావం.

''అలాగే పిశాచం—మీరు పన్నుల పేరుతో ప్రజలను ఉరి తీయించి శవాలుగా మారుస్తూంటే, ఆ శవాలను తింటూ బతుకుతున్నామని పరోక్షంగా చెప్పింది. చచ్చిన శవాలను పీక్కుతినే తమకన్న, బతికున్నవాళ్ళను పీక్కుతినే మీరు, ప్రమాదకారులనీ, మిమ్మల్ని ఏమైనా చేసి వుంటే, తమ పిశాచగణం, తనను శిక్షించే దనీ చెప్పింది.

''ఇకపోతే, రాక్షసుడు—మీ పాలన రాక్షసపాలనగా వుండడంతో, అడవులు పట్టి పోతున్న ప్రజలు, వాడికి తేలికగా దొరికి, ఆహారం అవుతున్నారు. అందుకే వాడు, తమను విడిచిపెట్టడమే కాకుండా, పదికాలాలపాటు చల్లగా వుండాలని దీవించాడు.''

ధర్మచరణుడు చెప్పినదంతా సావధానంగా విన్న, సింహకేతుడు, ''అయితే, దీని అర్థం—నేను దారిదోపిడిదొంగ, పిశాచం, రాక్షసుడు వంటి దుష్టశక్తుల కన్న, దుష్టుణ్ణనేగదా !'' అని అడిగాడు.

అందుకు ధర్మచరణుడు, వినయంగా, ''మహారాజా, ఆ సంగతి తమరు దీర్ఘంగా ఆలోచించుకోవలసి వుంటుంది. నేను అర్థం చేసుకుని వివరించింది, తప్పను కుంటే, క్షమించకోరతాను,'' అన్నాడు.

సింహకేతుడు, మంత్రి పాదాలకు నమస్కరించి, ''నాకు జ్ఞానోదయం కలిగించారు. ఇక నుంచి ధర్మపాలన చేస్తూ, ప్రజల నుంచి మంచి రాజన్న మన్ననలందుకుంటాను. ఆశీర్వదించండి!'' అన్నాడు.

ధర్మచరణుడు, రాజును ఆశీర్వదించి, ''మీలోని దుష్టశక్తులను జయించారు! చాలా ఆనందంగా వున్నది,'' అన్నాడు.

ఆ తర్వాత, సింహకేతుడు, ప్రజల మేలుకోరి ధర్మపరిపాలన చేస్తూ, అచిర కాలంలోనే ప్రజారంజకుడుగా మంచి పేరు తెచ్చుకున్నాడు.



# విడాకులు

సృష్ట్యాదిలో ఆరణి అనే ఒక ఋషి ఉండేవాడు. ఆయనకు ఒక వింత ఆలోచన కలిగింది: సృష్టిలో ఇన్ని రకాల జీవరాసులెందుకు? ఈ భూమిపై మానవులుంటేచాలదా?

ఆరణి బ్రహ్మను గూర్చి తపస్సు చేసి, ఇతర ప్రాణులను మనుషులుగా మార్చే వరం పొందాడు. ఆయన తపస్సు నుంచి తిరిగి వస్తూ, ఒక లేడి భయపడి పరిగెత్తి పోతూ వుండటమూ, ఒక పులి గాండ్రిస్తూ దానినితరుముతూ ఉండటమూ చూశాడు. ఆయన వెంటనే తన వరప్రభావం చేత ఆ లేడిని ఒక ఆడమనిషిగానూ, పులిని ఒక మగమనిషిగానూ మార్చేశాడు.

మగవాడికి ఆడదాన్ని చూడగానే మోహం పుట్టుకొచ్చింది. దాన్నే ఆ మగవాడు ప్రేమ అనుకుని, ఆ స్త్రీకి తన ప్రేమను గురించి వర్ణించి చెప్పాడు. అతని ప్రేమాలాపాలు విని ఆ స్త్రీ కూడా ఎంతో ఆనందం పొందింది.

వారిద్దరి మధ్యా ఏర్పడిన ఈ అన్యోన్యతకు ఆరణి చాలా సంతోషించి, వారిద్దరినీ వివాహ విధి ద్వారా భార్యాభర్తలు చేశాడు. వారు అరణ్యంలోనే ఒక ఇల్లు కట్టుకుని కాపురం మొదలెట్టారు.

భర్త అరణ్యంలోకి వెళ్ళి జంతువులను వేటాడి, వాటి మాంసం తెచ్చి తన భార్యను తినమనేవాడు. భార్యకు మాంసాహారం అంటే గిట్టేదికాదు; ఆమె పళ్ళూ, కాయలూ తినేది. భార్య మాంసం తినకపోవటం భర్తకు నచ్చలేదు, భర్త నిర్దయగా జంతువులను చంపటం భార్యకి నచ్చలేదు. ఆమె అరణ్యంలోని లేళ్ళనూ, పక్షులనూ చేరదీసి, పెంచుతూండేది. ఆరణి ఆశ్రమం నిర్మించుకుని వారి విషయాలన్నీ గమనిస్తూ ఉండేవాడు.

25-ఏళ్ళనాటి చందమామ కథ

రానురాను భార్యాభర్తల మధ్య విభేదాలు జాస్తి అయ్యాయి. భార్య పెంచే లేళ్ళనూ, పక్షులనూ భర్త చంపి తినేవాడు. భార్య చాలా బాధపడేది. భర్త పైన ఆమెకు కోపం కూడా వచ్చేది. తనలాగే పళ్ళూ, కాయలూ తినరాదా అని ఆమె భర్త నడిగేది. "నాలాగే నువ్వు కూడా మాంసం తిను," అని భర్త భార్యను శాసించేవాడు.

క్రమంగా ఇద్దరికీ ఒకరంటే ఒకరికి పడకుండా పోయింది. అయినా వాళ్ళు అలాగే కాపరం చేస్తూ, అనేకమంది మగ సంతానాన్నీ, ఆడ సంతానాన్నీ కన్నారు. వారిలో కొందరికి తండ్రి గుణాలూ, పోలికలూ, మరి కొందరికి తల్లి గుణాలూ, పోలికలూ వచ్చాయి.

భర్త భార్యను తరుచుగా చావగొట్టేవాడు, రకరకాలుగా, హింస పెట్టేవాడు. ఒకసారి అతనికి భార్య మీద పట్టరాని ఆగ్రహం వచ్చి, ఆమెను మృగాన్ని చంపినట్టు చంపటానికి విల్లెక్కుపెట్టాడు. భార్య భయపడి పారిపోయింది. భర్త ఆమెను తరుముకుంటూ వెళ్ళాడు. భార్య అరణి ఆశ్రమంలోకి జొరబడి దాక్కున్నది. వెనకనే భర్త కూడా అక్కడికి చేరాడు.

అరణి అతన్ని శాంతపరిచి, "మీరు ఒకరి నొకరు ద్వేషిస్తూ ఏం కాపరం చేస్తారు? విడిపోయి ఎవరి దారిన వారు వెళ్ళిపొండి?" అని చెప్పి, పచ్చగా నవనవలాడే రెండు ఆకులు తెచ్చి భార్యాభర్తలకు చెరొకటీ ఇచ్చి, "వీటిని తీసుకుని మీరిద్దరూ చెరొక దిక్కుగానూ వెళ్ళిపొండి. వీటి పసరు ఇగిరి, ఇవి ఎండుటాకులుగా మారేసరికి, మీ కిద్దరికీ విముక్తి కలుగుతుంది," అన్నాడు.

ఆ భార్యాభర్తలు ఆ ఆకులు పట్టుకుని చెరొక దిక్కుగా వెళ్ళిపోయారు. ఆ ఆకులు ఎండిపోయే సమయానికి మగవాడు పులిగా మారాడు, ఆడది లేడిగా మారింది.

వాళ్ళ పిల్లలకు మాత్రం పుట్టుకతో వచ్చిన పులి గుణాలూ, లేడి గుణాలూ కలకాలం అలాగే నిలిచిపోయాయి.





# అపకారికి ఉపకారం

## 4

పెద్దల అనుమతి తీసుకురావాలని ఇద్దరు గ్రామస్థులు వెళ్ళిన వెంటనే, పరదేశి, ఆ బాలుడి అరికాళ్లూ, అరచేతులూ బాగా రుద్దాడు. తర్వాత అరచేతితో, వాడి గుండెల మీద రాశాడు. కొద్ది క్షణాల్లో బాలుడు కళ్లు తెరిచి, చిన్నగా మూలిగాడు.

పరదేశి వెంటనే లేచి, ఇంటిపెరట్లోకి వెళ్ళాడు. అక్కడ వున్న ఏవో చెట్ల ఆకులు కోసుకువచ్చి, "ఈ ఆకులు, ప్రతి ఇంటి పెరటిదొడ్లోనూ వుంటాయి. వీటితో ఎన్నో రకాల వ్యాధులను నయం చేయవచ్చు," అంటూ, వాటిని తన రెండు అరచేతుల మధ్యా నలిపి, వచ్చిన రసాన్ని, ఆ బాలుడి నోట్లో నాలుగైదు చుక్కలు పోశాడు.

మరుక్షణం, బాలుడు లేచి కూర్చుని, తల్లిదండ్రులకేసి చూస్తూ చిన్నగా నవ్వాడు. బాలుడి తల్లి పట్టరాని ఆనందంతో పరదేశికి నమస్కరించి, "నువ్వు, మనిషివికాదు; దేవుడివి! చచ్చిపోయాడనుకున్న, నా బాబును రక్షించావు," అన్నది.

ఈలోగా, గ్రామపెద్ద లిద్దరూ అక్కడికి వచ్చారు. జరిగింది చూసి తెల్లబోయారు.

చిన్నపెద్ద, పరదేశివంక క్రూరంగా చూస్తూ, "మా మందులకు బతకనివాడు, నీ మందుకు బతికాడంటే, నువ్వు మాంత్రికుడివై వుండాలి. మా గ్రామానికెందుకు వచ్చావో చెప్పు?" అని గద్దించి అడిగాడు.

పరదేశి ఎంతో శాంతంగా, "అయ్యా, నేను మాంత్రికుణ్ణి కాదు. హిమాలయాల్లో, ఒక గొప్ప తపశ్శాలివద్ద పెరిగాను. ఆయన

దగ్గిరే, సకలవిద్యలూ అభ్యసించాను. మంచితనంతో పదిమందికీ సేవచేయమని, ఆయన ఆదేశించగా, దేశాలు తిరుగుతూ, యిక్కడికి వచ్చాను. నా కళ్ళముందే, ఒక నిండు ప్రాణం పోతూండగా చూడ లేక, నాకు తెలిసిన వైద్యం చేశాను,'' అని, గ్రామపెద్దలకు తన కథ చెప్పు కున్నాడు.

''మా అనుమతి లేకుండా, యీ బాలుడికి వైద్యం చేశావు. అందువల్ల, ఈ గ్రామానికే అరిష్టం. ఆ అరిష్టం పోవా లంటే—ఏ బాలుడినైతే నువ్వు బతికించావో, ఆ బాలుడి తల్లిదండ్రులే నిన్ను కొరడా దెబ్బలు కొడితే, భరించాలి. ఇందుకు, అంగీకారమేనా?'' అని అడిగాడు పెద్దపెద్ద.

''ఆ విధంగా, మీ గ్రామానికి అరిష్టం తొలగిపోతుందంటే, ఆ దెబ్బలు తినడానికి, నేను సిద్ధంగా వున్నాను.'' అన్నాడు పరదేశి.

పెద్దలు ఆజ్ఞాపించగా, ఆ బాలుడి తల్లి దండ్రులు, చెరొక పది కొరడా దెబ్బలు పరదేశిని కొట్టారు. పరదేశి వీపు చిట్లి రక్తం కారింది.

''మా గ్రామానికి అరిష్టం పోయింది. తక్షణం, నువ్వు గ్రామాన్ని విడిచివెళ్ళు!'' అన్నారు పెద్దలిద్దరూ.



అందుకు పరదేశి, ''అయ్యా, నావల్ల వచ్చిన అరిష్టం పోయే ఉపాయం, మీరే చెప్పారు. నేనెవరికే సాయం చేసినా, వారివల్ల ఇరవై కొరడా దెబ్బలు తింటూం టాను. ఆ విధంగా, మీ గ్రామానికే అరిష్టమూ వుండదు. నన్ను, ఈ గ్రామంలో కొంతకాలం వుండనివ్వండి,'' అన్నాడు.

ఈ జవాబు విని, గ్రామ పెద్దలు చాలా ఆశ్చర్యపడ్డారు. చిన్నపెద్ద, పరదేశిని, ''నువ్వు మూర్ఖుడిలా వున్నావు! దెబ్బలు తింటూ, ఈ గ్రామంలోనే వుండాలని ఎందుకనుకుంటున్నావు?'' అనిఅడిగాడు.

''అయ్యా, అపకారికూడా ఉపకారం చెయ్యమని, అన్ని శాస్త్రాలూ, పురాణాలూ



చెబుతున్నవి. అలాంటిది—ఈ గ్రామంలో ఉపకారం చేసిన నన్ను, కొరడా దెబ్బలు కొట్టి శిక్షించేటంత మూర్ఖులున్నారు. నాలాంటివాడు తప్ప, ఇలాంటి వాళ్ళకు మరెవరు సాయం చేయగలరు? వీళ్ళమీది జాలివల్లే, యిక్కడ కొంతకాలం వుండా లనుకుంటున్నాను,'' అన్నాడు పరదేశి.

పెద్దలిద్దరికీ, ఏం జవాబు చెప్పాలో తెలియలేదు.

ఈ పరదేశివల్ల, తమ అధికారానికి ప్రమాదం రావచ్చని, వాళ్ళు అనుమా నించి, ''నువ్వు, ఎన్ని చెప్పినా లాభం లేదు. వెంటనే గ్రామం వదిలిపో,'' అన్నారు కోపంగా.

''నేను వెళ్ళను!'' అన్నాడు పరదేశి నెమ్మదిగా.

''వెళ్ళకపోతే, నిన్ను బలవంతంగా పంపివేయగలం, తెలుసా?'' అన్నారు పెద్దలిద్దరూ రోషంగా.

పరదేశి చిరునవ్వు నవ్వి, ''నాకిష్టమై సహిస్తే సరే, కాని బలవంతంగా మాత్రం నన్నెవరూ ఏమీ చేయలేరు. నాకిష్టం లేనప్పుడు, నన్నెవరైతే కొడతారో వాళ్ళకే ఆ దెబ్బలు తగులుతాయి. నన్ను తోసిన వాళ్ళే పడిపోతారు. నాకు విషప్రయోగం చేసినవాళ్ళే చచ్చిపోతారు,'' అన్నాడు.

ఈ మాటలతో పెద్దలకు విపరీతమైన కోపం వచ్చింది, వాళ్ళక్కడున్న యిద్దరు యువకులతో, ''చూస్తారేం? వీడేదో మాంత్రికుడు. వెంటనే వీధి అవతలికి ఈడ్చేయండి,'' అన్నారు.

వెంటనే యువకులిద్దరూ, పరదేశిని సమీపించబోయారు. కాని, అప్పుడు ఒక విచిత్రం జరిగింది. ఎవరో ఈడ్చినట్టుగా, వాళ్ళిద్దరూ పోయి వీధిలో పడ్డారు.

ఇది చూసి, పెద్దలిద్దరూ వెలవెల పోయారు. వాళ్ళంతవరకూ, పరదేశిని బాగా వైద్యంతెలిసినవాడనే అనుకున్నారు. కాని, యిప్పుడు జరిగింది చూశాక, వాళ్ళ కతడు మాంత్రికుడేమో అన్న భయం కలిగింది. పెద్దలకు మాయమాటలతో,

ప్రజల్ని మోసపుచ్చడం తెలుసుగాని, మంత్రతంత్రాలు తెలీయవు.

''అయితే, నువ్వు నిజంగానే మాంత్రికుడి వన్నమాట! ఈ గ్రామానికి, మమ్మల్ని ఎదిరించడానికే వచ్చావా?'' అని అడిగాడు పెద్దపెద్ద.

''నేను మాంత్రికుణ్ణి కాదు. ఇతరులకు ఉపకారం చేస్తూండడమే, నాపని. నేనిక్కడికి మిమ్మల్ని ఎదిరించడానికి రాలేదు. మీకు సేవచేయాలని వచ్చాను. మిమ్మల్ని సేవించుకుంటే తప్ప, మీ గ్రామ ప్రజలకు సాయపడలేనుగదా!'' అన్నాడు పరదేశి.

తమనెదిరించననీ, సేవించుకుంటాననీ, పరదేశి చెప్పగానే, పెద్దలిద్దరికీ సంతృప్తి కలిగింది. వాళ్ళు వెంటనే, పరదేశి ఆ గ్రామంలో వుండేందుకు అనుమతించారు.

తర్వాత పరదేశితో, చిన్నపెద్ద, ''నువ్వు, మా అనుమతిలేకుండా ఎవ్వరికీ సాయపడకూడదు. ఆ సంగతి బాగా గుర్తుంచుకో,'' అన్నాడు హెచ్చరిస్తున్నట్టు.

''ఇతరులకు సాయపడే విషయంలో, నేనెవరి అనుమతికోసం ఎదురుచూడను. హాని చేయమంటే, నేనీదేశపు రాజు మాట కూడా వినను. మిగతా అన్ని విషయాల్లోనూ, మీరేం చెప్పినా చేస్తాను,'' అన్నాడు పరదేశి నిర్భయంగా.

పెద్దలిద్దరూ అయిష్టంగా తలలాడిస్తూ, అక్కణ్ణించి బయలుదేరారు. వాళ్ళ



నివాసం పక్క, పక్క ఇళ్ళల్లో. ఆ ఇళ్ళ మధ్య ఒక చావడి వున్నది. గ్రామస్థులు, ఆ చావడిలోనే, పెద్దలతో సంప్రతింపులు చేస్తూంటారు.

వాళ్ళ ఇళ్ళకు ఎదురుగా, ఒక పెద్ద దిబ్బ వున్నది. దానిమీద చిన్న గుడిసె ఒకటి వేయించి, పరదేశిని అందులో వుండమన్నారు. పరదేశి అక్కడ నివసించ సాగాడు.

పెద్దలిద్దరికీ, పరదేశి చాలా విచిత్రమైన మనిషిలా కనిపించాడు. అతడికి మంత్ర తంత్ర విద్యలు తెలిసినట్టు కనిపించినా, ఎవరిమీదా వాటిని ఎప్పుడుగాని ప్రయోగించలేదు. అతడెప్పుడూ చిరునవ్వుతో వుంటాడు తప్పితే, దేనికీ ఎవరిమీదా కోపగించుకోడు.

అతడు రోజూ పనిగట్టుకుని, గ్రామంలో ఎవరికెలాంటి కష్టమొచ్చిందో విచారించేవాడు. దానికి సులువైన పరిష్కార మార్గం చెప్పి, పెద్దలు ముందే నిర్ణయించిన విధంగా, వాళ్ళ చేత ఇరవై కొరడా దెబ్బలు తిని, ఆ బాధను మనోనిబ్బరంతో భరించేవాడు.

ఇలా కొంతకాలం జరిగేసరికి గ్రామస్థులకు, ఈ పద్ధతి చాలా అన్యాయం అనిపించింది. వాళ్ళల్లో కొందరు ఒక రోజున, పెద్దలిద్దర్నీ కలుసుకుని, ''మాకు సాయపడుతున్నవాణ్ణి, మేమే కొట్టడం, మాకు బాధ కలిగిస్తున్నది. ఈ పద్ధతి మానివేయడం మంచిదేమో!'' అన్నారు.

దానికి పెద్దపెద్ద కోపంగా, ''అంటే, మీరు నాకే, నీతులు చెబుతున్నారన్న మాట! ఆ పరదేశి పెద్ద మాంత్రికుడు. మీరు కొట్టే కొరడా దెబ్బలేవీ, వాడికి తగలవు. వాణ్ణి గ్రామంనుంచి తరిమెయ్యడానికి శక్తి చాలక వూరుకున్నాం. వాడేదో సొంత మేలుకోసం, ఈ గ్రామం వచ్చాడు. మాంత్రికులనుంచి మేలు పొందడం, అరిష్టదాయకం. కావాలంటే, ఒకసారి వాణ్ణి కొట్టకుండా వూరుకోండి, ఏం జరుగుతుందో, మీకే తెలుస్తుంది.'' అన్నాడు.

—(ఇంకావుంది)



## వానరులూ— వానరమానవులూ



కోతులకు లాగా వానరమానవుల (ఏప్స్)కు తోకలు ఉండవు. ఈ రెంటికీ ఉన్న మరొక ముఖ్యమైన తేడా ఏమిటంటే వానరమానవుల చేతులు, కాళ్ళకన్నా పొడవైనవి. కోతులకన్నా ఏప్స్ చాలా తెలివైనవి.

టొకాన్ పక్షిముక్కు చూడడానికి బరువుగా కనిపించినప్పటికీ, అది బరువైనది కాదు. అది పలుచటి పోగుల్లాంటి పదార్థంతో అల్లబడి, పైన బలమైన ఎముకతో కప్పబడి ఉంటుంది. ఇది ఎంతో ధృడంగా ఉన్నా, చాలా తేలికగా ఉంటుంది.




## మంచుగడ్డల తెప్ప



అంటార్కిటికా ఖండాన్ని కలుపుతూన్న 500 మైళ్ళ పొడవైన రాస్ మంచుమెరక, నిజానికి నీళ్ళపైన తేలుతూన్న మంచుగడ్డల తెప్ప. ఇది దాదాపు 200 అడుగుల ఎత్తూ, 600 మైళ్ళ వెడల్పూ కలిగి ఉన్నది.

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1987 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.



Smt. I. Uma Rani



S. G. Seshagiri

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఏప్రిల్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మిగిలితే కష్టం! రెండవ ఫోటో : పగిలితే నష్టం!

పంపినవారు : కె. కె. రావు, వలజాలమ్మ వీధి, గూడూరు–524 101 (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు–600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి :

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు–600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

